# పాడుదాం తీయగా క్యాంప్కో పాట!

పాలు మీగడ నిండినది. కమ్మని కలలా రుచికరమైనది.
ఇది నాకు నచ్చిన చక్కని చాక్లెట్. క్యాంప్కో క్రీమీ మిల్క్ చాక్లెట్.

భారతదేశపు అతిపెద్ద అత్యాధునిక కర్మాగారం నుండి,
క్యాంప్కో లిమిటెడ్, మంగుళూరు.



సత్యం వున్న చోట జయం ఉండు;
మంచి ఉన్నచోట సుఖం మెండు
మంచి చిత్రం వున్న చోట జనం నిండు!
అందరూ వేనోళ్ల పొగుడుతున్న వినోదాత్మక కథా చిత్రం





నాగిరెడ్డి - చక్రపాణి

చందమామ విజయా
కంబైన్స్

# బృందావనం

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం సింగీతం శ్రీనివాసరావు

నిర్మాత
బి. వెంకట్రామరెడ్డి





పాండా

చందమామ కలెక్షన్‌నుంచి బోలెడు రకరకాల చక్కని. మెత్తటి ముచ్చటైన ఆటబొమ్మలు. ప్రతి బొమ్మ ఎంతో ప్రత్యేకమైనది!

మీ బిడ్డ ఏళ్ళ తరబడి ఎంతో మమకారంతో ఒక్క క్షణం కూడా వదలకుండా ఆడుకొనేలా ఎంతో ప్రత్యేకంగా చందమామ కలెక్షన్‌లో ప్రతి ఆటబొమ్మను తయారుచేయడం జరిగింది.



బౌ-వౌ

- ఏ వయుస్సు పిల్లలకైనా - ఎంతో సురక్షితమైనది
- అత్యంత శ్రేష్టమైన సింథటిక్ ఫైబర్‌తో తయారుచేయడంవల్ల యివి దీర్ఘకాలం మన్నుతాయి.
- వీటిని శుభ్రంగా నీళ్ళతో కడగవచ్చు వెడిపోవు. వంకరపోవు.

అంతేకాదు. మీ పిల్లలు సంబరపడే విధంగా ఓ అందమైన కానుక!



జంబో

మీరు కొనుగోలుచేసే ప్రతి చందమామ సాఫ్ట్ టాయ్‌తో మీ దుకాణందారుని

ఉచిత గిఫ్ట్ కూపన్

అడగండి. దానిని పూర్తిచేసి. యిచ్చిన చిరునామాకు పోస్టుచేయండి. అనేక గంటల తరబడి మీ పిల్లలకు వినోదం కలిగించే కానుకల్ని మేము పోస్టులో పంపుతాం

ఇప్పుడే కొనండి - ఈ సదవకాశం పరిమిత కాలం వరకే.

అన్ని ముఖ్యమైన షాపులలోనూ లభ్యమవుతాయి.



స్పోర్టి




# CHANDAMAMA
# COLLECTION

# తన కలలు చెదిరి పోనీయకండి.
# అవి నిజం కానివ్వండి.
# అందుకై చేపట్టండి బాలల కానుక వృద్ధి నిధి.



మీ బిడ్డకు, తనతోబాటే పెరిగే కానుక నొకదాన్ని ఇవ్వండి. యూనిట్ ట్రస్ట్ వారి బాలల కానుక వృద్ధి నిధిలో పెట్టుబడి పెట్టండి. మీ బిడ్డకి 21 ఏళ్ళు వచ్చే సరికల్లా, మీ పెట్టుబడి మొత్తం తన అవసరాలు తీర్చుకోవడంలో సహాయపడడానికి తయారుగా వస్తుంది.

మీరు ఒకేసారిగా కొంత మొత్తం కానుకగా ఇవ్వవచ్చు. లేదా ఏటేటా కొద్దిపాటి మొత్తాలు చేర్చుతూ రావచ్చు. ఏ పద్ధతి ఎంచుకున్నా సరే, తనకి 21 ఏళ్ళు వచ్చే సరికల్లా లక్షాధికారి అయ్యేలా చూడొచ్చు. (తనకి అవసరమైతే 18 ఏళ్ల వయస్సులో డబ్బు వావను తీసుకునే వసతి ఉంటుంది).

యూనిట్ ట్రస్ట్ వారి బాలల కానుక వృద్ధి నిధి. ఎందుకంటే రవంత ముందాలోచనతో బంగారమంటి భవిష్యత్తుకు బాట వేయవచ్చు.

దరఖాస్తు ఫారాలు యూనిట్ ట్రస్ట్ శాఖలలోను, బ్యాంకులన్నిటిలోను, కలెక్షన్ సెంటర్లలోను స్వీకరించబడుతాయి.

దరఖాస్తు ఫారం గల కరపత్రం కోసమై ఏ యూనిట్ ట్రస్ట్ శాఖలోగానీ, ముఖ్య ప్రతినిధి లేదా ఏజెంటు వద్దగానీ సంప్రదించండి.

బాలల కానుక వృద్ధి నిధి

## ~~13%~~ 14% డివిడెండు

## బోనస్ ప్రతి
## ~~5~~ 3 ఏళ్లకొకసారి



## యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా

22 మిలియన్ల మంది పైగా యూనిట్ స్వంతదార్ల సేవకై అంకితం.

సెక్యూరిటీ పెట్టుబడులన్నిటిపైనా మార్కెట్ రిస్కు ఉంటుంది. పెట్టుబడి పెట్టే ముందుగా మీ పెట్టుబడి సలహాదారునుగానీ, ఏజెంటునుగానీ సంప్రదించండి.

**Branch Offices:** • Hyderabad Ph: 240030 • Vijayawada Ph: 63964 • Visakhapatnam Ph: 50275

Sista's UTI.1968.92 TE B

# చందమామ




సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## ప్రేమమతం

1993 మనకూ, మన దేశానికీ ఎంతో ప్రాముఖ్యతగల సంవత్సరం. స్వామి వివేకానంద చికాగోలో జరిగిన ప్రపంచమతాలమహాసభలో ఉపన్యసించి, ఈ సంవత్సరంతో వందసంవత్సరాలు పూర్తవుతాయి. ప్రపంచ దృష్టిని ఆకర్షించిన స్వామివివేకానంద, ఆ ఉపన్యాసం ద్వారానే మహోన్నతమైన హైందవ మత సిద్ధాంతాలు ప్రపంచానికి తెలియవచ్చాయి.

స్వామి వివేకానంద ఆ మహాసభలో మాట్లాడడానికి ముందు, వేదికమీది పెద్దలకు బదులు, ఎదుట కూర్చున్న సాధారణ శ్రోతలకు నమస్కరించాడని చెబుతారు. "అమెరికా సోదరసోదరీమణులారా!"అని ఆయన తన ఉపన్యాసం ప్రారంభించడంతోనే శ్రోతలు ఆనంద పారవశ్యం చెందారట! ఒక్క ఉపన్యాసంతో ఆయన అక్కడి శ్రోతలలోనే కాదు; ప్రపంచంలోని ఆలోచనా పరులందరి హృదయాలలోనూ మహత్తరమైన మార్పును తీసుకువచ్చాడు.

వివేకానందుడు ప్రబోధించింది ప్రేమమతం. ఏ దేశానికి చెందినవారైనా, ఏ మతానికి చెందినవారైనా ప్రజలందరూ సమానులేనని ఆయన ప్రబోధించాడు. ప్రజల మధ్య పరస్పర ప్రేమానురాగాలను పెంచేదే నిజమైన మతమని ఆయన ఉద్బోధించాడు.

ఆయన తరవాత, మహాత్మగాంధీ కూడా ఈ సిద్ధాంతాలనే బోధించాడు. దేశ ప్రజలలో ఆత్మవిశ్వాసాన్నీ, త్యాగనిరతినీ, నూతనోత్తేజాన్నీ కలిగించాడు. అవే మన స్వాతంత్ర్యసిద్ధికి దోహదం చేశాయి.

"మనది, పరులను జయించాలన్న కోరిక గల జాతి కాదు. అందుకే ఇంకా నిలబడ గలుగుతున్నాం!" అన్నాడు వివేకానంద ఒక సందర్భంలో. ఇది నిజమే అయినప్పటికీ— మనం జయించవలసినది కూడా ఒకటి ఉన్నది. అదే— మనలోని అహంకారం. అహంకారాన్నీ, మనలోని బలహీనతలనూ జయించినప్పుడే నిజమైన ప్రేమ చిరకాలం నిలుస్తుంది!

సంపుటి 91 జనవరి'93 సంచిక 1

విడి ప్రతి : 4.00 : : సంవత్సర చందా : 48.00







# మన ఐకమత్యాన్ని కాపాడుకుందాం

45 సంవత్సరాల క్రితం మన పత్రిక చందమామ ను ప్రారంభించాము. మనదేశ ఆధునిక చరిత్రలో చాలా ముఖ్యమైన కాలఘట్టం అది. పరాయి పాలన విముక్తికోసం సాగిన సుదీర్ఘ పోరాటం విజయవంతం కావడం; అఖండ భారతదేశం – ఇండియా, పాకిస్తాన్‌లుగా విడిపోవడం రెండూ అప్పుడే జరిగాయి.

దాస్యశృంఖలాలూ, మతద్వేషాలూ తొలగిపోయాయి; ఇక ముందున్నదంతా – శాంతి, సౌఖ్యం, సమైక్యత, అభివృద్ధి అని దేశప్రజలందరూ ఉజ్వల భవిష్యత్తుకోసం కొండంత ఆశతో ఎదురు చూసిన సమయం అది.

ఆ ఆశలన్నీ ఇప్పుడు పగటికలలు కావలసిందేనా? తమ జీవితాలను త్యాగంచేసిన మన పెద్దల విశ్వాసం వమ్ము కావలసిందేనా? ఇటీవల కొన్ని దురదృష్టకరమైన సంఘటనలు జరిగి పోయాయి. మతాలూ, రాజకీయాలూ మన మధ్య గోడలు లేపుతున్నాయి. అయితే, మతాలు వేరయినప్పటికీ మనమందరం ఒక దేశమాత బిడ్డలం; మన రాజకీయాలు ఏమయినప్పటికీ మన మందరం భారతీయులం – అన్న సత్యం మరచిపోకూడదు. మన జీవితాలు నాశనమై, ముందు తరాల వారి జీవితాలు అంధకారబంధురం కాకుండా ఉండాలంటే ఈ సత్యాన్ని ప్రతి ఒక్కరూ గ్రహించి తీరాలి.

"ప్రతి ప్రాణిలోనూ దేవుడున్నాడు; అందరినీ ప్రేమించాలి," అని హైందవ మత గ్రంథాలు ప్రబోధిస్తున్నాయి. ప్రవక్త మహమ్మద్, "దేవుడికోసం, నువ్వు నిస్వార్థంగా చేసే మంచి పనులనే దేవుడు ఎక్కువగా ఇష్టపడతాడు," అని ఉద్బోధించారు. ఏసుక్రీస్తు, "నిన్ను నువ్వు ప్రేమించే లాగానే నీ పొరుగువారిని కూడా ప్రేమించు," అని అదేశించారు. అంతేకాని, ఎదుటివారిని ద్వేషించమని ఏ మతమూ చెప్పడం లేదు.

భిన్నత్వంలో ఏకత్వానికి ప్రతీక మన చందమామ. వివిధ భాషలలో వెలువడుతూ, భారత దేశంలోని బాలబాలికలందరికీ వినోదవిజ్ఞానాలు అందిస్తున్నది. అందుకే, మతకలహాలతో భారతజాతి ఐకమత్యాన్ని కోల్పోవడాన్ని ఎంతో బాధాకరమైన విషయంగా భావిస్తున్నది. మనదేశ చరిత్రలో దీనినొక తాత్కాలికమైన అపశ్రుతిగానే భావిస్తూ, దానిని త్వరగా తొలగించి, ప్రజల మధ్య శాంతిసామరస్యాలను నెలకొల్పడానికి ప్రియమైన చందమామ పాఠకులందరూ కృషిచేయాలని ఆశిస్తున్నాము.

జైహింద్!

బి. విశ్వనాథరెడ్డి

చందమామ పబ్లికేషన్స్

# చైనాలో వస్తూన్న మార్పులు



1991వ సం॥లో సోవియట్ యూనియన్‌లోకమ్యూనిస్టు ప్రభుత్వపతనం, సోవియట్ యూనియన్ విచ్ఛిత్తి, వీటి కారణంగా చైనా వంటి ఇతర కమ్యూనిస్టు దేశాల లోనూ కొన్నిమార్పులు వస్తు న్నాయి.

గత అక్టోబర్ నెలలో చైనా కమ్యూనిస్టుపార్టీ 14వ జాతీయ కాంగ్రెస్ మహాసభలు జరిగాయి. అప్పుడు 'సోషలిస్టు ఎకానమీ' ప్రాతిపదికగా సంస్కరణలు తీసుకురావాలన్న ఉద్దేశంతో రాజ్యాంగచట్టంలో కొన్ని సవరణలు ప్రవేశ పెట్టారు. చైనాను ఇంతవరకు 'వెదురుతెర' దేశంగా వర్ణించేవారు. అంటే, విదేశ పెట్టు బడులనూ, వనరులనూ, సాంకేతిక పరి జ్ఞానాన్నీ అక్కడ అనుమతించేవారు కాదు. అయితే, ఇప్పుడు ఇతర దేశాలతో ఆర్థిక, సాంకేతిక సహకారాలను పెంపొందించు కోవాలని ఆ సమావేశం తీర్మానించింది. అంటే, చైనా బయట ప్రపంచంతో ఆర్థిక సంబంధాలకు తలుపులు తెరిచిందన్న మాట!

'బూజుపట్టిన' పాత విధానాలు దేశ ఆర్థిక పురోగతికి ఆటంకంగా ఉన్నట్టు ఆ సమావేశం అభిప్రాయం వెలిబుచ్చింది. పార్టీ ప్రధాన కార్యదర్శి సమర్పించిన 2,600 మాటల నివేదికలో– మార్కెట్ శక్తులకు స్వేచ్ఛ నిచ్చినప్పుడల్లా ఆర్థిక రంగంలో శక్తివంతమైన, సత్వరమైన అధిక అభి వృద్ధినిసాధించినట్టుపేర్కొ న్నారు. "సంస్కరణ కూడా విప్లవమే. ఉత్పత్తి శక్తు లకు స్వేచ్ఛనివ్వడమే దాని లక్ష్యం"– అని నివేదిక తెలియజేసింది.

కాంగ్రెస్ తీసుకున్న నిర్ణయాన్ని 'రెండవ చైనా విప్లవం'గా హర్షించారు. 1949వ సం॥లో మావోసేటుంగ్ నాయకత్వంలో కమ్యూనిస్టుపార్టీ అధికారంలోకి వచ్చింది. మావోకు కుడిభుజం వంటివాడైన డెంగ్‌సియోపింగ్, మావో మరణానంతరం 1978వ సం॥ నుంచి చైనాను ఆధునీకరణ చేయడానికీ, ఆర్థికరంగ పునర్నిర్మాణానికీ పూనుకున్నారు. 1987వ సం॥లో జరిగిన 13వ జాతీయ కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షత వహించిన తరవాత ఆయన 'పొలిట్‌బీరో'నుంచి వైదొలగారు. ఆయనకు ఇప్పుడు 88 సంవత్సరాలు. అయినప్పటికీ, ఆయన శాంతియుత విప్లవానికి కృషి చేస్తున్నారు. ఒక సంవత్సరం క్రితమే దేశాన్ని

త్వరతగతిలో 'మార్కెట్ఎకానమీ' వైపు మళ్ళించడానికి ధైర్యంగా ప్రచారం ప్రారంభించారు. 'డెంగ్ సిద్ధాంతం' అని దానికి పేరుపెట్టారు. ఆధునిక చైనా చరిత్రలో అది ఒక సుస్థిరమైన, సుసంపన్న శకానికి నాంది పలక గలదని భావిస్తున్నారు. ఇటీవల జరిగిన జాతీయకాంగ్రెస్ తీర్మానం దానిని సాధికారంగా ఆమోదించింది.

ఈనాటి చైనా 'నేత' జాతీయ కాంగ్రెస్ సమావేశాలకుహాజరుకాలేదు. కాని, ఆఖరు రోజుమాత్రం 'పొలిట్‌బీరో'సభ్యులను పలకరించడానికి కొంతసేపు కనిపించి వెళ్ళారు. 'పొలిట్‌బీరో'సభ్యులలో అధికసంఖ్యాకులు యాభై వయసువాళ్ళే. తన సిద్ధాంతాలను ఆ 'యువతరం' మిత్రులే విజయవంతం చేయగలరని డెంగ్ ఆశిస్తున్నారు.




చైనాను క్రీ.పూ. 18-12 శతాబ్దాల మధ్య షాంగ్ వంశస్థులు పరిపాలించారు. క్రీ.పూ. 3వ శతాబ్దంలో అదొక సామ్రాజ్యంగా ఏర్పడింది. అప్పుడే హాన్ వంశస్థుల రక్షణకోసం మహాకుడ్యాన్ని (1,450 మైళ్ళ (2,250 కి.మీ.) పొడవూ, 25 అడుగుల (8మీ.) ఎత్తూగలది) నిర్మించారు. క్రీ.శ. 3వ శతాబ్దం తరవాత క్విన్ వంశస్థులు అధికారంలోకి వచ్చారు. ఆ తరవాత టాంగ్ వంశస్థులు (7-10 శతాబ్దాలు) సాంగ్ వంశస్థులు (10-13) శతాబ్దాలు క్వింగ్ వంశస్థులు 1912 వరకు పాలించారు. 1912వ సం॥లో సన్ యట్‌సేన్, పాలకులను దించి ప్రజాస్వామ్యం నెలకొల్పాడు. ఆయన అనంతరం జనరల్ ఛియాంగ్ కాయ్ షెక్, కుమింటాంగ్ (జాతీయపార్టీ) అధికారంలో ఉన్నారు. రెండవ ప్రపంచయుద్ధ సమయంలో (1939-45) చైనాలో కొంత భాగాన్ని జపాను ఆక్రమించింది. అయితే, జపాన్ ఓటమి తరవాత కమ్యూనిస్టులు చైనానంతటినీ తమ అధికారంలోకి తెచ్చారు. 1949 అక్టోబర్ 1వ తేదీ 'పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా' ఆవిర్భవించింది!



# బాకీ వసూలు

సూరయ్య సీతాపురానికి కొత్తగా వచ్చి స్థిర పడినవాడు. మొదటినుంచీ అవసరంలో వున్న వారికి, మితిమీరిన వడ్డీలకు అప్పు లిచ్చి బాగా కూడబెట్టాడు. పూర్వం వున్న ఊళ్ళో కొంతమంది కుర్రకారు తిరగబడి, ఇకపై అధిక వడ్డీలు వసూలు చేస్తే సహిం చేదిలేదని గట్టిగా బుద్ధిచెప్పడంతో, స్థిరా స్తులన్నీ అమ్మి, సీతాపురం చేరాడు.

సీతాపురం వచ్చాక కూడా, సూరయ్య తన పాత ధోరణిని మార్చుకోలేదు. అతడు అప్పులైతే ఇచ్చాడు కానీ, వాటిని తిరిగి వసూలు చేయడం కష్టమైంది.

సూరయ్య అవస్థ చూసిన పొరుగువాడు, "నీకు సాయపడగలవాడు ఒక్క చందనపురి సుమేధుడు మాత్రమే. వెళ్ళిఅతడిసహాయం అడుగు," అని సలహా ఇచ్చాడు.

సూరయ్య వెంటనే చందనపురి వెళ్ళి, సుమేధుడిని కలుసుకున్నాడు. సుమేధుడు ఇరవై ఏళ్ళ యువకుడు. చందనపురి శివారులోని మామిడితోపులోవుంటున్నాడు.

సుమేధుడితో తను వచ్చిన పని వివ రించి, ఎలాగైనా సహాయపడాలని వేడు కున్నాడు సూరయ్య. 'సుమేధుడు ఒక వారం రోజుల్లో సీతాపురం రాగలనని చెప్పాడు.

అన్నట్టుగా సుమేధుడు సీతాపురం వచ్చాడు. సూరయ్య, అతడికి తన వద్ద అప్పు తీసుకుని ఇవ్వకుండా తిప్పుతున్న వాళ్ళపేర్లుచెప్పాడు. అంతావిని సుమేధుడు, ఒక్కవారం రోజుల్లో వాళ్ళనుంచి బాకీ వసూలు చేయడం గానీ, సులువుగా వసూ లయ్యే మార్గంగానీ సూచించగలనని, సూర య్యకు చెప్పాడు.

రెండు రోజుల తర్వాత సుమేధుడు, సూరయ్యను అతనికి బాకీవున్న సుంద రయ్య ఇంటికి తీసుకువెళ్ళి, అక్కడ ఏం

దాసరి వెంకటరమణ



మాటనమ్ము," అని ఎంతగానో బతిమాలు కున్నాడు.

"ఆ మాట ఊళ్ళోని నలుగురు పెద్ద మనుషుల ముందు ఒప్పుకుంటే, ప్రస్తుతానికి వదిలేస్తాను," అన్నాడు సూరయ్య.

చేసేదిలేక సుందరయ్య పెద్దమనుషుల ముందు సూరయ్యకు వాగ్దానం చేశాడు.

అంతలో అక్కడికి ఒక వ్యక్తి వచ్చాడు. వస్తూనే సుందరయ్యతో, "క్షమించండి, సుందరయ్యగారూ! పట్నంలో గొడవలుగా వుండడంతో, నాకు డబ్బు సకాలంలో అందలేదు. నిన్ననే అంది, నేనే వద్దామని అనుకుంటూంటే, మీ తాలూకు మనిషి వచ్చి, సూరయ్యగారికి డబ్బు ఇవ్వవలసి వచ్చిందని, వెంటనే రమ్మంటున్నారని చెప్పాడు. ఇదుగోనండి డబ్బు! సూరయ్యగారికి ఎంత ఇవ్వాలో ఇచ్చెయ్యండి!" అన్నాడు.

సుందరయ్య ముఖం వాడిపోయింది. నీరసంగా డబ్బు అందుకుని, పెద్దమనుషుల ముందు సూరయ్య బాకీ తీర్చేశాడు.

సుందరయ్య వద్ద బస్తాలు, ఫలానా వ్యక్తి ద్వారా పట్నంలో అమ్మాడనీ, అతడి నుంచి సుందరయ్యకు డబ్బు రావలసి వుందనీ తెలుసుకున్న సుమేధుడు, ఈ పథకం వేశాడు.

సూరయ్యకు బాకీ వున్న మరొక వ్యక్తి చంద్రస్వామి. సుమేధుడు అతణ్ణి ప్రతి

చెయ్యాలో వివరంగా చెప్పి, తనకు వేరే పనుందని వెళ్ళిపోయాడు.

సూరయ్య, సుందరయ్యను బయటకు పిలిచి బాకీ విషయం అడిగాడు.

సుందరయ్య, "ఇస్తాలేవయ్యా, నా దగ్గిరున్నప్పుడు!" అని నిర్లక్ష్యంగా సమాధానం చెప్పాడు.

సూరయ్య అతణ్ణి వదలకుండా, ఇచ్చేదాకా కదిలేదిలేదని మొండికేశాడు. ఈ గొడవకు వీధిలో నలుగురూ పోగయ్యారు. పెద్ద రచ్చ అవుతుందని భయపడిన సుందరయ్య, సూరయ్యను లోపలికి పిలిచి, "నా దగ్గిర డబ్బు రాగానే, తప్పకుండా నీ బాకీ వడ్డీతో సహా తీరుస్తానయ్యా! దయచేసి నా

క్షణం వెంటాడి పరిశీలించసాగాడు. అతడి కేమీ అధారం దొరకలేదు. కానీ, చంద్ర స్వామి తరచుగా ఊరి మధ్యలోని పెద్ద భవంతిలో వుండే రామరాజు ఇంటికి వెళ్ళి వస్తూంటాడని తెలిసింది.

సుమేధుడు మరికొంత ప్రయత్నం చేసే సరికి అసలు విషయం తెలిసిపోయింది.

రామరాజు నగరంలో చాలా పలుకుబడి వున్నవ్యక్తి. చంద్రస్వామికి, చదువు పూర్తయి నిరుద్యోగిగా తిరుగుతున్న ఒక కొడుకు న్నాడు. రామరాజు ద్వారా వాడికి రాజాస్థా నంలో ఏదైనా ఉద్యోగం వేయించాలని అతని ఉద్దేశ్యం. అందుకు రామరాజు చేసిన ప్రయత్నం ఫలించి, త్వరలో చంద్ర స్వామికొడుకుకు నగరంలో ఉద్యోగంవచ్చే సూచనలు కన్పిస్తున్నాయి.

సుమేధుడు బాగా ఆలోచించిన మీదట సూరయ్యను పిలిచి, రామరాజు ఇంటికి వెళ్ళి ఏం చెయ్యాలో చెప్పాడు.

సూరయ్య అదే ప్రకారం రామరాజు వద్దకు వెళ్ళి, తనకు చంద్రస్వామి బాకీ వున్న విషయం చెప్పి, "చాలా రోజుల నుంచి బాకీ వాయిదా వేస్తూ వస్తున్నాడు. దయచేసి, చంద్రస్వామి నా బాకీ చెల్లిం చేలా చూడండి.మీ మేలు ఎప్పటికీ మరు వను," అన్నాడు.

రామరాజు, సూరయ్య ముందే చంద్ర స్వామిని పిలిపించి, "ఏమయ్యా! అప్పు



తీసుకున్న వాడివి, దాన్ని సక్రమంగా తీర్చా లన్న ధ్యాసలేదా? రేపు నాక్కూడా ఇలాగే చేస్తావా?" అని అడిగాడు.

చంద్రస్వామి ముఖం చిన్నబుచ్చుకుని, అప్పటికప్పుడే వెళ్ళి, డబ్బుతో తిరిగివచ్చి, సూరయ్య అప్పు చెల్లించాడు.

సూరయ్య, సుమేధుడి తెలివితేటల్ని పొగిడి, "నీ సహాయం నేను మరిచిపో లేనిది. అయితే, ఇకముందు కూడా నావ్యాపారం సజావుగా జరగడానికి, ఏదైనా మంచి చిట్కా చెప్పి వెళ్ళు," అన్నాడు.

దానికి సుమేధుడు, "ఎన్ని చిట్కాలు చెప్పి ఏం లాభం! మన వ్యాపారం నిజా యితీతోకూడుకుని, నలుగురూ హర్షించేలా

వున్నప్పుడు, ఎలాంటి చిట్కాలూ అవసరం లేదు. ఎదుటి వాడి అవసరాన్ని ఆసరాగా తీసుకుని, మితిమీరిన వడ్డీకి ఆశపడ కుండా, ధర్మవడ్డీ తీసుకోండి, చాలు!" అన్నాడు.

"అంతా బావుంది కానీ, ఇంకా ఒక్క బాకీ మిగిలిపోయింది. అదికూడా వసూలయి వుంటే బావుండేది," అన్నాడు సూరయ్య పెద్దగా నిట్టూర్చుతూ.

"ఎవరూ? ఆ శంకరయ్య సంగతేనా? చెప్పాను కదా! పాపం, అతణ్ణి వదిలెయ్యి. వాళ్ళ తమ్ముడితో గొడవపడి పంతానికి పోయి, చాలా నష్టపోయాడు," అన్నాడు సుమేధుడు.

"అయితే, ఆ బాకీ నేను పూర్తిగా వదులు కోవలసిందేనా?" అన్నాడు సూరయ్య చాలా బాధగా.

సుమేధుడు కాసేపు మౌనంగా ఆలో చించి, "నీకు ఇన్ని బాకీలు వసూలు చేసి పెట్టాను, అందుకు నాకు ప్రతిఫలంగా కొంత ఇస్తావు కదా! ఆ సొమ్ము నాకేం వద్దులే. దానిని శంకరయ్య బాకీ కింద జమకట్టుకో," అన్నాడు.

నిర్వికారంగా, మాటలో ఏమాత్రం విరుపు లేకుండా అంటున్న సుమేధుడి ముఖంలోకి చూసిన సూరయ్యకు, జ్ఞానో దయం అయినట్లయింది. అంతేకాదు, అప్పటికప్పుడు ఒక నిశ్చయానికి వచ్చాడు. సుమేధుడిపై అంత నమ్మకం కలిగింది, సూరయ్యకు.

సూరయ్య ఒకసారి గొంతు సవరించు కుని, "నువ్వు తెలివైన వాడివే కాదు; మంచి మనసున్న వాడివి. నువ్వన్నట్టు నీకివ్వ వలసిన డబ్బు, శంకరయ్య బాకీ కింద జమ కట్టుకుంటాను. కానీ నీకు ప్రతి ఫలంగా, నేనొక కానుక ఇవ్వదలిచాను. ఆ విషయం మా అమ్మాయి సువర్చల నడిగి చెబుతాను," అంటూ లోపలికి నడిచాడు.

అంతవరకూ తలుపు చాటున వుండి, వాళ్ళ సంభాషణ వింటున్న సూరయ్య ఏకైక పుత్రిక సువర్చల సిగ్గుతో పెరట్లోకి పరుగు తీసింది.





# వ్యాఘ్రేశ్వరభూపతి

దండకారణ్య సమీపాన గల పులిచింతల అనే పరగణాను వ్యాఘ్రేశ్వరభూపతి అనే రాజు పాలించేవాడు. ఆయన పేరుకు తగ్గట్టు అక్షరాలా చండశాసనుడు. ఆయన మాటలకూ, చర్యలకూ ఎదురన్నది లేదు. ఎవరైనా కాదుకూడదనేందుకు సాహసిస్తే, తక్షణం ఉరితీయించేవాడు.

వ్యాఘ్రేశ్వరభూపతి, పులిచింతల పరగణాలోని కొన్ని అస్థిరపరిస్థితుల కారణంగా రాజయ్యాడు. రాజవుతూనే ఆ పరగణాకు వ్యాఘ్రపురి రాజ్యం అని పేరు పెట్టాడు. దానికి రాజైన తను వ్యాఘ్రేశ్వరుడు! ఆశ్రయంకోరి వచ్చిన ఒక పేదపండితుడు, ఆయనకు–భూపతి అంటే భూమికంతటికీ సమ్రాట్టు అనీ, రాజంటేసాక్షాత్తూ, ఆ దేవుడే అనీ చెప్పాడు. ఇదిబాగా తలకెక్కించుకున్న వ్యాఘ్రేశ్వరుడి గొంతు మారింది, మాట తీరు మారింది, హావభావాలు మారాయి.

ఇటువంటి పరిస్థితుల్లో, హిమాలయాల్లో చిరకాలం కఠిన తపస్సు చేసిన, ఒక రుషీశ్వరుడు వ్యాఘ్రపురికి వచ్చాడు. ఆయన ఎన్నో సిద్ధులు పొందినవాడు.

ప్రజలు ఆ రుషికి భక్తివిధేయతలతో సేవలూ, పూజలూ చేస్తూ, ఆయన చేసే ధర్మబోధ వినసాగారు. ఈ సమాచారం వేగులవాళ్ళు రాజుకు నివేదించారు. దేవుణ్ణి గురించి ఆయనకున్న విశ్వాసానికిభిన్నంగా, రుషి బోధలు చేస్తున్నాడని చెప్పారు.

ఇది విని, వ్యాఘ్రేశ్వరుడు నిప్పులు కక్కుతూ, భటులను పిలిచి, "ఒరే, మీరు తక్షణంపోయి,హిమాలయాలనుంచి వచ్చిన రుషిని, సభకు ఈడ్చుకురండి! వాడికి ఆ హిమాలయాల్లో చలిదెబ్బకు మతి మందగించి వుంటుంది," అన్నాడు.

భటులు పోయి రుషిని సభకు లాక్కు వచ్చారు. ఆయన్ని చూస్తూనే, వ్యాఘ్రేశ్వ

జెట్టి శంకరరావు

రుడు కళ్ళెర్రచేసి, "నేను భూపతిని; అంటే సమ్రాట్టును. భూపాలకుడైనరాజు, సాక్షాత్తూ దేవుడే అని, మా ఆస్థాన పండితుడు సర్వజ్ఞ చూడామణి, ఏనాడో నాకు చెప్పాడు. అలాంటిది, నువ్వు మరెవరో దేవుడంటూ ప్రజల్లో ప్రచారంచేస్తూ, నన్ను అవమాన పరుస్తున్నావు. నిన్నీ క్షణంలోనే ఉరి తీయిస్తాను!" అన్నాడు.

ఇందుకు రుషి చిరునవ్వు నవ్వి, "రాజా, మీ వద్ద సర్వజ్ఞచూడామణితోపాటు, వివేకవంతులైన మరిద్దరు మంత్రులున్నారని విన్నాను. వారిని నేనొక ప్రశ్న అడగ దలిచాను. వారి జవాబులు తెలిశాక, నన్నలాగే ఉరితీయించండి," అన్నాడు.

రుషి అడిగినదానికి, వ్యాఘ్రేశ్వరభూపతి సరేనన్నాడు. అప్పుడు రుషి మూడు తాళపత్రాలమీద, "మట్టి అనగా ఏమిటి?" అని రాసి ముగ్గురికీ ఇచ్చాడు.

దానికి జవాబుగా ఒక మంత్రి, "భూమి ఏర్పడింది ఈ పదార్థంతోనే," అని రాశాడు. రెండవ మంత్రి, "మట్టి, నీటికి భిన్నమైన పదార్థం," అని రాశాడు. పండితుడు, "చరాచర జీవులన్నింటికీ చరమ దశలో ఆశ్రయం ఇచ్చేదే మట్టి," అని రాశాడు.

ఆ మూడు తాళపత్రాలనూ రుషి, రాజు చేతికిచ్చి, "రాజా, చూశావా! మహా వివేకవంతులూ, ప్రతిభాశాలులైన ముగ్గురూ, మట్టివంటి అతి సామాన్య పదార్థం గురించి భిన్నాభిప్రాయాలు వెలువరించారు. అటువంటప్పుడు, ఉన్నతోన్నతమైన దైవభావనకు, ఒకేవిధమైన సమాధానం సాధ్యమవుతుందా?" అని ప్రశ్నించాడు.

వ్యాఘ్రేశ్వరభూపతి కొద్దిసేపు మౌనంగా వూరుకుని, తర్వాత సింహాసనం దిగి రుషిని సమీపించి, తలవంచి, "మహర్షీ! మీ ప్రశ్న ద్వారా ఈ క్షణంలో నాకు యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం కలిగించారు. నేను తమ శిష్యుణ్ణి, ఆశీర్వదించండి!" అన్నాడు.

రుషి, రాజును ఆశీర్వదించాడు. ఆ తర్వాత వ్యాఘ్రేశ్వరభూపతి తన చండ శాసనాలన్నిటినీ రద్దు పరిచి, ప్రజారంజకంగా చాలాకాలం రాజ్యపాలన చేశాడు.






## 10

[విద్యావతి కనిపించకుండా పోయిన నాటి నుంచి తన దగ్గరకు రాని జగత్పతి ప్రవర్తనపట్ల వాచస్పతాచార్యులకు అనుమానం కలిగి, ఆయన ఆ సంగతిని రాజుకు తెలియపరచాడు. యువరాణిని వెతకడానికి వెళ్ళిన మహేంద్రనాధుడు, అరణ్యమధ్యంలోని మాయాభవనం కాపలాదారుగా చేరి అక్కడి పరిసరాలను ఎంతో జాగ్రత్తగా పరిశీలించ సాగాడు. – తరవాత]

మరునాడు సాయంకాలం మహేంద్ర నాధుడు, ముందుగానే తాను కాపలా ఉండవలసిన ద్వారం, దగ్గరికి చేరు కున్నాడు. మాయాభవనం నుంచి ఎవరైనా వెలుపలికి వస్తారా అని మాటిమాటికి ఉద్యానవనం కేసి చూడసాగాడు. కొంత సేపటికి ముగ్గురు యువతులు భవనం నుంచి వెలుపలికి వచ్చారు. వాళ్ళ వెంట వృద్ధస్త్రీ లేదు. ముగ్గురు యువతులూ ఒకేవిధమైన దుస్తులూ, ఆభరణాలూ ధరించి ఉండడంవల్ల, వెంటనే నిన్న కనిపించిన యువతి ఎవరో పోల్చుకోలేక పోయాడుమహేంద్రనాధుడు. కొంతసేపటికి ఆ ముగ్గురిలో ఒక యువతి వెళ్ళిపోయింది. ఉద్యానవనంలో ఇద్దరు మాత్రమే మిగి లారు. తరవాత ఆ ఇరువురిలో ఒక యువతి ఉద్యానవనంలో విహరించ సాగింది. మరొక యువతి ఒకచోట కూర్చున్నది.



మహేంద్రనాథుడు ఒక చెట్టు చాటున నిలబడి, ఆ యువతి అటుకేసి వచ్చినప్పుడు, "యువరాణి, విద్యావతీ!" అని పిలిచాడు మెల్లగా. ఆ యువతి చప్పున తల తిప్పి కంఠస్వరం వినిపించిన దిక్కుకేసి చూసింది. కాని అతడెక్కడున్నాడో పసిగట్టలేక ముందుకు నడిచింది. తిరిగి ఆమె ఆ చెట్టు దగ్గరికి వచ్చినప్పుడు మళ్ళీ మహేంద్రనాథుడు ఆమె పేరుపెట్టి పిలిచాడు. అప్పుడా యువతి కొంతసేపు అక్కడ ఆగిందే తప్ప, తనకు కాపలా ఉన్న పరిచారికకు అనుమానం రాకుండా ఉండాలన్న ఉద్దేశంతో, మళ్ళీ కొంత ముందుకు నడిచి వెనక్కు తిరిగి వచ్చింది.

అప్పుడు మహేంద్రనాథుడు చెట్టు చాటు నుంచి తొంగి చూశాడు. వెంటనే ఆ యువతి తన వేలిని నోటికి అడ్డుగా ఉంచి గట్టిగా మాట్లాడ వద్దని అతన్ని హెచ్చరించింది. అంతలో దూరంగా కూర్చున్న పరిచారిక లేచి వేగంగా తనకేసి రావడం గమనించిన ఆ యువతి, ఆకాశం కేసి చూస్తూ, "రేపు" అని చెప్పి తిన్నగా భవనం కేసి నడవ సాగింది.

ఆనాటి రాత్రి మహేంద్రనాథుడు మరింత జాగ్రత్తగా కాపలాకాయ సాగాడు. మాయాభవనం పైఅంతస్థులోని ఒకే ఒక గదిలో మాత్రం దీపాలు వెలుగుతున్నాయి. అయితే, అది నిన్న దీపాలు వెలిగిన గది కాదు. అంటే, ఉద్యానవనం నుంచి తిరిగి వెళ్ళిన ఆ యువతి ఒక్కొక్క రాత్రి ఒక్కొక్క గదిలో గడపడానికి ఏర్పాట్లు చేశారని అతడు గ్రహించాడు. పైగా, ముగ్గురు యువతులూ ఒకేవిధమైన దుస్తులూ, ఆభరణాలూ, ధరించేట్టు చేయడం, కొత్త వాళ్ళకు యువరాణిని గుర్తుపట్టకుండా చేయడానికి తీసుకున్న జాగ్రత్త అని కూడా మహేంద్రనాథుడు గ్రహించాడు.

కొంతసేపటికి అక్కడికి వచ్చిన ద్వారపాలకుణ్ణి, "మిత్రమా! ఈ రోజంతా కనిపించనేలేదు, ఏమిటి విశేషం?" అని చిరునవ్వుతో పలకరించాడు మహేంద్రనాథుడు.

"అవును, ఇవాళ మరికొందరు పండితులు వచ్చారు. వచ్చినవారిని వెంటనే యజమాని దగ్గరికి తీసుకువెళ్ళాలి కదా! అందుకని అక్కడే ఉండిపోయాను. నువ్విక్కడ జాగ్రత్తగా ఉండు సుమా!" అని హెచ్చరించి హడావుడిగా వెళ్ళిపోయాడు ద్వారపాలకుడు.

మరునాడు ఉదయం కూడా వంటశాల నుంచి ఇద్దరు పరిచారికలు ఆహార పానీయాలు తీసుకుని వెళ్ళడం మహేంద్రనాథుడు గమనించాడు. అప్పుడు వాళ్ళ వెంట వృద్ధస్త్రీ లేదు.



ఆ రోజు సాయంకాలం ఆ యువతి కాస్త ముందుగానే వనవిహారానికి వచ్చింది. ఆమె వెంట ఒక పరిచారిక మాత్రమే ఉన్నది. ఇద్దరూ కలిసి కొంతసేపు వనంలో అటూ ఇటూ తిరిగారు. ఆ తరవాత పరిచారిక ఒకచోట కూర్చున్నది. ఆ యువతి ఏపుగా ఉన్న చెట్ల దగ్గరికి వచ్చి ఎవరినో వెతుకుతున్నట్టు చెట్లలోకి చూసి ముందుకు వెళ్ళింది. ఆమె మళ్ళీ అటు వచ్చినప్పుడు, "యువరాణీ! నేను మహేంద్రనాథుణ్ణి, వీరగిరి నుంచి వచ్చాను," అన్నాడు చెట్టుచాటున దాక్కుని ఉన్న మహేంద్రనాథుడు.

ఆ యువతి ఆ మాటలను వినికూడా అక్కడ ఆగలేదు. కొంతదూరం ముందుకు వెళ్ళి, తిరిగివచ్చి, "అవును, నేను యువరాణి విద్యావతినే! ఇక్కడి నుంచి బయటపడాలి!" అన్నది మెల్లగా.

"యువరాణీ! నిన్ను ఇక్కడికి అపహరించుకుని వచ్చిన వారెవరు?" అని అడిగాడు మహేంద్రనాథుడు.

"నాకు తెలియదు: ఆ సంగతి ఒక్క వృద్ధస్త్రీకి మాత్రమే తెలుసు," అన్నది యువరాణి.

"ఆమె ఎవరు? ఎక్కడ ఉంటుంది?" అని అడిగాడు మహేంద్రనాథుడు.

"ఆమె పేరు కమల అని చెప్పుకుంటుంది. ఆమె రూపం మాత్రం, రాజప్రాసాదం లోని వృద్ధపరిచారిక కమలలాగే ఉంటుంది. అయితే, ఆమె కూడా నిన్నటి



నుంచి కనిపించ లేదు!" అన్నది యువరాణి.

"నీ వెంటవున్న పరిచారికలు ఎవరు?" అని అడిగాడు మహేంద్రనాధుడు.

"చాలామంది ఉన్నారు. చూడడానికి అందరూ ఒకే లాగా ఉంటారు. వాళ్ళ పేర్లు కూడా నాకు సరిగ్గా గుర్తులేదు!" అన్నది యువరాణి.

"వాళ్ళేమీ నీతో చెప్పలేదా?" అని అడిగాడు మహేంద్రనాధుడు.

"అవసరానికి మించి ఒక్క ముక్క మాట్లాడరు. ఏదో కుట్రలాగా కనిపిస్తున్నది. ఆపద ముంచుకురాక ముందే ఇక్కడి నుంచి తప్పించుకోవాలి," అని చెప్పి, యువరాణి దూరంగా ఉన్న పరిచారిక దగ్గరికి వెళ్ళింది. అంతలో అక్కడికి మరొక పరిచారిక కూడా రావడంతో, ముగ్గురూ కలిసి మౌనంగా మాయాభవనం లోపలికి వెళ్ళారు.

యువరాణిని చూసిన ఉత్సాహంతో ఉప్పొంగిపోయాడు మహేంద్రనాధుడు. అదృష్టవశాత్తు యువరాణి క్షేమంగానే ఉన్నది. ఆమెను ఇక్కడికి తీసుకువచ్చిన వారెవ్వరు? తాను దూరం నుంచి చూసిన ఈ మాయాభవన యజమాని, ఆ పని చేసి ఉంటాడా? అతడు కాకపోతే మరెవ్వరు చేశారు? ఎందుకు ఆ పని చేశారు? యువరాణిని సురక్షితంగా రాజుగారికి అప్పగించడం ఎలాగా? అని ఆలోచిస్తూ కూర్చున్నాడు మహేంద్రనాధుడు.

"ఏమిటి బాగా అలిసి పోయినట్టున్నావు?" అన్న ద్వారపాలకుడి కంఠస్వరం విని ఉలిక్కిపడి, వెంటనే తేరుకుని, "లేదు, మిత్రమా! నీ సలహా ప్రకారం కాస్త పెందలాడే ఇక్కడికి వచ్చి కూర్చున్నాను. అంతే! ఇంతకు ముందు ఎవరో కొందరు స్త్రీలు ఉద్యానవనంలో తిరగడం చూశాను," అన్నాడు మహేంద్రనాధుడు, ఏమాత్రం ఆసక్తి లేనివాడిలాగా.

"స్త్రీలా? నువ్వు వాళ్ళను అంతకు ముందు చూశావా?" అని అడిగాడు ద్వారపాలకుడు.

"లేదు," అన్నాడు మహేంద్రనాధుడు తల అడ్డంగా ఊపుతూ.

"అయితే, వాళ్ళను ఇక మీదట చూసే అవకాశం కూడా నీకు లేదు. ఎందుకంటే వచ్చిన పండితులందరూ తిరిగివెళు తున్నారు. ఒక పల్లకీని తీసుకురమ్మని యజమాని ఆజ్ఞాపించాడు. ఆయన పల్లకీలో వెళ్ళడం నేనెప్పుడూ చూడలేదు. బహుశా, అది ప్రస్తుతం భవనంలో ఉన్న యువరాణి కోసమే అయి ఉంటుంది. ఆమె వెళ్ళిందంటే ఆమె వెంట స్త్రీలందరూ కూడా వెళ్ళిపోతారు కదా!" అన్నాడు ద్వార పాలకుడు నవ్వుతూ.



"అలాగా!" అన్నాడు మహేంద్రనాధుడు.

"అవును మిత్రమా! ఈ ఒక్కరాత్రి చాలా జాగ్రత్తగా ఉండు," అని చెప్పి వెళ్ళిపోయాడు ద్వారపాలకుడు.

మహేంద్రనాధుడి మనసులో మళ్ళీ అలజడి ప్రారంభమయింది. ద్వార పాలకుడు చెప్పిన విషయాన్ని యువరాణికి తెలియజేయడం ఎలాగా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు. అర్ధరాత్రి దాటింది. భవనం లోని దీపాలన్నీ ఆరిపోయాయి. మహేంద్ర నాధుడు చప్పుడు కాకుండా మెల్లగా భవనంలోకి ప్రవేశించాడు. ప్రధాన ద్వారం తలుపులు మూసి ఉన్నాయి. గొళ్ళాన్ని పట్టుకుని కాస్త అటూ ఇటూ కదిలించి చూశాడు. లోపల గడిపెట్టినట్టున్నది. ఇంకొక తలుపు ఉన్నదేమో అనుకుని పక్కలకు వెళ్ళిచూసి కనిపించకపోయేసరికి మళ్ళీ వెనక్కు వచ్చి, తలుపును ఎడమ చేత్తో ముందుకు - తోశాడు. అంతే! తలుపులు అమాంతంగా తెరుచుకున్నవి. ఎదుట సన్నటి మార్గం కనిపించింది. రెండువైపులా తలుపులు మూసిన గదులు. ఎక్కడా మనుషుల అలికిడి లేదు. మహేంద్రనాధుడు ఆ మార్గంకుండా వెళ్ళి, చివర ఉన్న మెట్ల మీదుగా పై అంతస్తుకు చేరుకున్నాడు. అక్కడ కూడా సన్నటి మార్గమూ, రెండు వైపులా తలుపులు మూసిన గదులూ కనిపించాయి. అయితే, అతడు ఎడమచేత్తో తాకగానే తలుపులు



వాటంతట అవి లోపలికి తెరుచుకో సాగాయి. అలా అతడు ఒక గదిలోకి ప్రవే శించాడు. ఎవరో ఎదుట నిలబడినట్టని పించి ఒక్క క్షణం ఉలిక్కిపడ్డాడు. అయితే, అది ఎదురుగుండా ఉన్న నిలువుటద్దంలో పడిన తన ప్రతిబింబమే అని వెంటనే గ్రహించాడు. ఆ గదినిండా నిలువుటద్దాలు అమర్చబడి ఉన్నాయి. మసక చీకటిలో ఎటువైపు తిరిగినా తన నీడే కనిపించింది. అక్కడి నుంచి పక్క గదిలోకి వెళ్ళాడు.

ఆ గది కూడా ఖాళీగానే ఉన్నది. అక్కడి నుంచి మూడవ గదిలోకి వెళ్ళాడు. అక్కడ కొందరు స్త్రీలు మంచాలపై పడుకుని నిద్రపోతున్నారు. వాళ్ళల్లో యువ రాణి ఉన్నదా అని కొంతసేపు పరిశీలించి చూసి, కనిపించకపోయేసరికి, అక్కడి నుంచి పక్కగదిలోకి వెళ్ళాడు. అక్కడా కొంతమంది స్త్రీలు నిద్రపోతున్నారు. ఆఖరికి మహేంద్రనాధుడు ఐదవ గదిలోకి ప్రవేశించాడు. అక్కడ హంసతూలికాతల్పం మీద ఒక యువతి నిద్రపోతున్నది. ఆమె యువరాణి అయివుంటుందని గ్రహించి, ఆమెను సమీపించబోయినప్పుడు, అతని ఎడమ చేతి వేలికి పెట్టుకున్న ఉంగరం ఒకసారి తళుక్కున మెరిసింది. మార్గ మధ్యంలో ముని ప్రసాదించిన ఉంగరం మహిమ కారణంగానే తలుపులువాటంతట అవి తెరుచుకున్నాయని అతడు గ్రహిం చాడు. అతడు యువరాణి భుజాన్ని మెల్లగా తాకాడు. ఆమె ఉలిక్కిపడి లేచి, మరుక్షణమే తల్పం పై నుంచి దిగి, "మహేంద్రనాధా! నువ్వు ఇక్కడికి ఎలా వచ్చావు?" అని అడుగుతూ అతని వెంట వెలుపలికి వచ్చింది.

"ఆ సంగతి తరవాత చెబుతాను. రేపు నీ ప్రయాణానికి పల్లకీ సిద్ధంగా ఉన్నది. ఈ భవనం యజమాని ఏర్పాటుచేసి ఉన్నాడు!" అన్నాడు మహేంద్రనాధుడు.

"ఎక్కడికి తీసుకువెళతారు?" అని అడిగింది యువరాణి.

"ఆ విషయం నాకు తెలియదు యువరాణీ! వాళ్ళు తీసుకువెళ్ళే చోటికి

వెళ్ళడానికి నీకు సమ్మతమా, కాదా అన్న విషయం నాకు తెలియాలి," అన్నాడు మహేంద్రనాధుడు.

"నేను వాళ్ళతో వెళ్ళను. నా తల్లి దండ్రులను చూడాలి. నువ్వు సహాయం చేయగలవా?" అని అడిగింది యువరాణి.

"నిన్ను మన రాజ్యానికి తీసుకుపోయి, రాజుగారికి అప్పగించడానికే నేను వచ్చాను యువరాణీ! అందుకు రాజుగారి అనుమతి కూడా పొందాను. మీ కుడిభుజంమీద పుట్టుమచ్చ ఉన్నట్టు రాజుగారు ఆనవాలుగా చెప్పమన్నారు. మీరు నన్ను నమ్మాలి!" అన్నాడు మహేంద్రనాధుడు.

యువరాణి సరే అన్నట్టు తల పంకించి "మరి ఆలస్యం ఎందుకు? ఇప్పుడే వెళ్ళి పోదాం!" అన్నది.

"అవును. అదే ఉత్తమం. నా దగ్గర ద్వారంతలుపుతాళంచెవి ఉన్నది. అయినా, ఈ అపరాత్రి వేళ బయలుదేరడానికి నీకు భయంగా లేదు కదా!" అని అడిగాడు మహేంద్రనాధుడు.

"లేదు. ఇక్కడ వుండి, తెల్లవారగానే ఏం జరుగుతుందో అని భయపడడం కన్నా, ఇక్కడి నుంచి వెళ్ళిపోవడమే మేలు. నువ్వు, తోడుగా ఉన్నావు కదా! మరింకేం భయం, కాలయాపన చేయకుండా వెళ్ళి పోదాం!" అన్నది యువరాణి.

"అలాగే యువరాణీ! భవనం నుంచి బయటపడేవరకు నువ్వు నా వెంట కొద్ది దూరంలో నిశ్శబ్దంగా నడిచి రావాలి," అని హెచ్చరించి మహేంద్రనాధుడు భవనం వెలుపలికి నడిచాడు.

ఇద్దరూ వెలుపలి ద్వారాన్ని సమీపించారు. అంతా నిశ్శబ్దంగా ఉన్నది. మహేంద్రనాధుడు, ఏమాత్రం అలికిడి కాకుండా జాగ్రత్తగా తలుపు తెరిచి, మొదట యువరాణిని వెలుపలికి పంపి తానూ వచ్చి, జాగ్రత్తగా లోపలివైపు తాళం వేశాడు.

"మాయాభవనం నుంచి బయటపడ్డాం. మరి ఇప్పుడు ఎటు వెళ్ళాలి? వీరగిరికి వెళ్ళే మార్గం నీకు తెలుసా?" అని అడిగింది యువరాణి. —(ఇంకావుంది)






# దేవతాపుష్పం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఒక దేశానికి అధినేతగా సకల సౌఖ్యాలూ అనుభవించే అవకాశమున్న నువ్వు, ఈ అర్ధరాత్రివేళ భీతి కొలిపే శ్మశానంలో, ఏ అదనపు సౌఖ్యాన్ని ఆశించి పడరానిపాట్లు పడుతున్నావో, నేను ఊహించలేక పోతున్నాను. బహుశా, ఏ అతీంద్రియశక్తులో సాధించి, నిత్యయవ్వనుడిగా జీవించాలనే కోరికతో కాదు గదా? ఒకవేళ అదే నీ కోరిక అయితే, వెంటనే దురాశకు స్వస్తి చెప్పి, నీ రాజ్యానికి తిరిగి వెళ్ళడం మేలని నా అభిప్రాయం. ఎందుకంటే ఒక్కొక్కసారి అతీంద్రియశక్తుల సాయంతో సాధించదలచిన కార్యం కూడా, అతిచంచలమైన మానవనైజంతో పొత్తు

## బేతాళ కథలు




కుదరని కారణంగా, విఫలం కావడం జరుగుతుంది. ఇందుకు ఉదాహరణగా, వసంతవర్మ అనే వృద్ధరాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

పూర్వం వైజయంతీపురాన్ని వసంతవర్మ అనే రాజు పాలించేవాడు. ఆయన చాలా వృద్ధుడై పోయాడు. సంతానహీనుడైన ఆ మహారాజుకు, తన తదనంతరం రాజ్యానికి వారసులు లేకుండా పోతారే అన్న దిగులు పట్టుకున్నది. అంతేకాక, మరికొన్నాళ్ళకు తానీలోకం వదిలి పోక తప్పదు గదా అన్న భీతితోకూడిన విచారం ఆయనను మరింత కృంగదీయసాగింది ఇలా వుండగా— ఒక నాటి పున్నమి రాత్రి ఆయన, మంత్రి చరణ గుప్తుడితో కలిసి రాజప్రాసాదంపైన విహ రించసాగాడు.

ఆ సమయంలో ఆయన వున్నట్టుండి మంత్రితో, "మహామంత్రీ! ఈ మనోహర మైన వెన్నెల, సొగసైన ఉద్యానవనం, నా రాజప్రాసాదం, రాజ్యం— ఇవన్నీ విడిచి పెట్టి, అంతూదరీ తెలియని ఏవో లోకాలకు నేను త్వరలో ఒంటరిగా పయనించక తప్పదు. నా సార్వభౌమత్వం రేపు నన్ను నిర్దాక్షిణ్యంగా కబళించే ఆ మృత్యుకోరల నుంచి కాపాడలేదు కదా!" అన్నాడు ఎంతో విచారంగా.

మహారాజు మృత్యునైరాశ్యాన్ని ఎలా పోగొ ట్టాలో మహామంత్రికి తోచలేదు. ఆ కార ణంగా ఆయన తలవంచుకుని మౌనంగా వుండిపోయాడు.

ఇంతలో ఒక చిత్రం జరిగింది. ఆకాశ మార్గం నుంచి గాల్లో తేలుతూ వచ్చిన ఒక బంగారు వన్నె పుష్పం, సరిగ్గా వారి ముందు పడింది.

మహారాజు ఆశ్చర్యంతో వంగి,ఆ పుష్పాన్ని తీసుకుని వాసన చూసి, "మహామంత్రీ! ఈ పుష్ప పరిమళాన్ని వర్ణించడానికి, నాకు మాటలు రావడం లేదు," అన్నాడు పరవ శంగా.

"ప్రభూ, ఆకాశయానం చేసే, ఏ గంధర్వ కాంత సిగనుంచో జారిపడ్డ పువ్వయి

వుంటుంది. దీనివల్ల ఏదో ప్రయోజనం వుండే వుంటుంది. దీనివిషయం రేపు మన ఆస్థాన పురోహితుడితో చర్చించడం అవసరం," అన్నాడు మంత్రి.

మర్నాడు రాజపురోహితుడు ఏకాగ్రతతో పుష్పలక్షణాలను క్షుణ్ణంగా పరిశీలించి, "మహారాజా! అమరలోకపు గంధర్వ, కిన్నెర స్త్రీలు ఎంతో అపురూపంగా భావించి ధరించే, అమృతవర్ధిని అనే పుష్పం ఇది. వృద్ధులకు యవ్వనాన్ని ప్రసాదించే అద్భుతమైనశక్తి, ఇలాంటి పుష్పాలకు వుంటుందని, వైద్యశాస్త్రవేత్తలు సూచించారు. ఒక యువకుడు కానీ, యువతి కానీ విధాతను మనసారా ధ్యానించి, ఈ దివ్యపుష్పాన్ని ఆఘ్రాణించి, తన కిష్టమైన వృద్ధులకు, తమ యవ్వనాన్ని దానం చెయ్యవచ్చు. ఒక అమృతవర్ధిని పుష్పం కేవలం ఒక వ్యక్తికి మాత్రమే యవ్వనాన్ని ప్రసాదించగలదు," అంటూ, ఆ పుష్పమహాత్యం వివరించాడు.

ఇది విని మహారాజు పట్టరాని ఉత్సాహంతో, "మహామంత్రీ! మహారాజుకు తన యవ్వనాన్ని ధారపోసే యువకుడికి, అర్ధ రాజ్యమిచ్చిఅమూల్యమైన కానుకలతో సత్కరిస్తామనిచాటింపువేయించండి!" అన్నాడు.

అయితే, చాటింపు వేయించి వారం రోజులు గడిచినా ఏ ఒక్కయువకుడూ ముందుకురాకపోవడం, మహారాజును తీవ్రమైన ఆశాభంగానికి గురిచేసింది.



ఇలా లాభంలేదని నలుగురు భటుల్ని వెంటతీసుకుని, మంత్రి స్వయంగా నగరంలోకి బయలుదేరాడు. ఒకచోట ఆయనకు సత్రం అరుగు మీద కూర్చుని యాచించుకుంటున్న ఇద్దరు బిచ్చగాళ్ళు కనిపించారు. వాళ్ళల్లో ఒకడు రెండు కళ్ళూ లేనివాడు. మరొకడు ఏదో చర్మవ్యాధితో బాధపడుతున్నవాడు. అయితే, ఇద్దరూ పాతికేళ్ళలోపు యువకులు.

మంత్రి వాళ్ళను సమీపించి, "వారం రోజుల క్రితం మహారాజు వేయించిన చాటింపు వినేవుంటారు. మహారాజుకు తన యవ్వనాన్ని ధారపోసిన త్యాగవంతుడికి, అర్ధరాజ్యమిచ్చి గౌరవించడమే కాకుండా,

మహారాజు మరెన్నో విలువైన కానుకలిచ్చి సత్కరిస్తాడు. ఇప్పుడు దీనికోసం మీలో మీరు పోటీ పడడం మాని, త్వరగా ఎవరో ఒకరు ముందుకు రండి!" అన్నాడు లౌక్యంగా.

మంత్రి చెప్పింది విని, బిచ్చగాళ్ళిద్దరూ నిరాసక్తంగా వుండిపోయారు. ఇది చూసి మంత్రి కోపంగా, "ఏరా, మీకు అర్ధరాజ్యం ఏలుకోవడం కన్న, ఇలా అడుక్కుతిని బతకడమే సుఖంగా వుందా?" అని అడిగాడు.

అందుకు గుడ్డివాడు, "గుడ్డివాణ్ణయిన నాకు అర్ధరాజ్యమెందుకు? గుడ్డివాళ్ళకు కూడా అర్ధరాజ్య మివ్వజూపే ధర్మ ప్రభువులు పదికాలాల పాటు చల్లగా వుండాలి," అన్నాడు భయపడుతూ జీవం లేని నవ్వొకటి నవ్వి.

వెంటనే రెండోవాడు, "బాబూ, రాజు గారికి నా యవ్వనాన్నిచ్చి, నేను ముసలి వాణ్ణయ్యాక, ఆ అర్ధరాజ్యం వల్ల నేనను భవించే సుఖం ఏముంటుంది? ఉన్న వ్యాధితో పాటు అకాలవార్ధక్యం కూడా తోడయితే, దానికన్న నరకం మేలు!" అన్నాడు ఈసడిస్తున్నట్టు.

బిచ్చగాళ్ళ మాటలకు ఒళ్ళుమండిన మంత్రి, "ఛీ ఛీ, ముష్టివెధవలక్కూడా లోకువైపోయాను!" అని గొణుక్కుంటూ, వెనుదిరిగి కోటకు బయలుదేరాడు.

ఆయన కోటచేరేసరికి, ఆ రోజు బంధించి తెచ్చిన గజదొంగ సింగన్నను విచారిస్తు



న్నాడు రాజు. ఇరవైఏళ్ళు దాటని సింగన్నను చూసి, మంత్రి విస్మయం చెందాడు.

రాజు ప్రశ్నించిన మీదట సింగన్న, "ప్రభూ, నేను నగరంలోని అక్రమార్జనా పరులైన సంపన్నుల గృహాలే దోచాను. ఆ సొమ్మంతా నిరుపేదలకు పంచిపెట్టాను. నేనేనాడూ స్త్రీలను దోపిడీ చెయ్యలేదు; అవమానించలేదు. నాకు ప్రాణాపాయం ఏర్పడిన పరిస్థితుల్లో కూడా, హత్యలకు పాల్పడ లేదు," అన్నాడు నిర్భయంగా.

దొంగ మొహం చూస్తే, అసత్యాలు పలికే వాడిలా కనిపించలేదు రాజుకు. వాడి నీతి నియమాలు కూడా రాజును ముగ్ధుణ్ణి చేశాయి. అయినా, వాడు దొంగ! వాణ్ణి ఎలా శిక్షించకుండా వదలడం? అని రాజు ఆలోచిస్తున్నంతలో మంత్రి ఆయనను సమీపించి, చిన్నగొంతుతో, "ప్రభూ, నగర మంతా గాలించి వస్తున్నాను. అర్ధరాజ్యం ఆశచూపినా, ముష్టివాళ్ళుకూడా ముందుకు రావడంలేదు. ఈ నేరస్థుడికి ఏ శిక్ష విధించినా, మనకు కలిగే లాభం ఏమీ లేదు. మీరు ఊఁ అనండి చాలు! మిగతా కథ నేను నడుపుతాను," అన్నాడు.

ఇందుకు మహారాజు యవ్వన ప్రలోభంతో సరే అని తల ఊపాడు.

మంత్రి, దొంగను సమీపించి, గొంతు సవరించుకుని, "సింగన్నా, నువ్వు చేసిన దోపిడీలకు ఎలాగూ నీకు ఉరిశిక్ష పడుతుంది... " అంటూ ఇంకా ఏదో చెప్పబోతుండగా, దొంగ మధ్యలోనే అందుకుని,





"రాజుగారికి, నా యవ్వనం దానమిస్తే, ఉరిశిక్షా తప్పుతుంది, అర్ధరాజ్యమూ దక్కుతుంది– ఇదేకదా మీరు చెప్పదలచింది?" అన్నాడు చిరునవ్వుతో.

మంత్రి, దొంగ తెలివితేటలకు అబ్బురపడి, "నువ్వు నా మనసులోని ఆలోచనను ఇట్టే గ్రహించావు! నేను చెప్పదలచింది, నీకిష్టమేగదా?" అని అడిగాడు.

గజదొంగ పకపకా నవ్వి, "మహారాజు సహృదయంతో నన్ను క్షమించి వుంటే, ఆయన ఔదార్యానికి సంతోషించేవాణ్ణి. లేదా చట్టబద్ధంగా ఏ శిక్ష విధించినా, ఆయన నిజాయితీకి గర్వపడేవాణ్ణి. ఈ రెండూ జరక్కపోవడంతో, నా అంచనాలన్నీ తలకిందులయ్యాయి. రాజుగారి చాటింపు నేను విన్నాను. అర్ధరాజ్యం కూడా ఆశించకుండా, నా యవ్వనాన్ని మహారాజుకు త్యాగం చెయ్యాలని నిశ్చయించుకున్నాను. ఆ ఉద్దేశంతోనే, కావాలని మీ భటులకు చిక్కాను. అయితే, ఇప్పుడు నా నిర్ణయం మార్చుకున్నాను! ఆపదలో చిక్కుకున్న వాళ్ళను, తమ స్వప్రయోజనాలకు ఉపయోగించుకోవాలను కోవడం, నీచాతినీచం. ఇప్పుడు మహారాజు చేసిందదే!" అన్నాడు.

గజదొంగ మాటలకు ఉగ్రుడైపోయిన రాజు, "నువ్వుచేసిన దారుణమైననేరాలకు, ఈ క్షణమే నిన్ను ఉరితీయించ గలను," అన్నాడు.

సింగన్న ఏమాత్రం తొణక్కుండా, "మీకు న్యాయమని తోస్తే, అలాగే ఉరితీయించండి, ప్రభూ! అయితే, మీరు విధించే శిక్షకు భయపడి, నేను కాళ్ళబేరానికొస్తానని మాత్రం భ్రమపడకండి," అన్నాడు.

సింగన్న మాటలు మహారాజును నిశ్చేష్టుణ్ణి చేశాయి. అవమానభారంతో ఆయన మొహం కందగడ్డలా అయింది. చాలాసేపు మౌనంగావుండి, తర్వాత సింహాసనం మీది నుంచి దిగి వచ్చి, సింగన్నను సమీపించి, ఎంతో ఆప్యాయంగా వాణ్ణి ఆలింగనం చేసుకుని, "సింగన్నా, నువ్వు నా కళ్ళు తెరిపించిన మహర్షివి. జీవితపు ఆఖరి దశలోనైనా, నువ్వు నాకు తారసిల్లడం, నా

పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను. వారసులులేని నా సింహాసనానికి, నిన్నీ క్షణమే వారసుడిగా నియమించి, నేను సన్యాసం స్వీకరిస్తున్నాను," అన్నాడు పరమానందంతో.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, వృద్ధాప్యంలో రాజు వసంతవర్మకు మతి భ్రమించినట్టు కనబడుతున్నది. లేకుంటే దోపిడీలు చేసి జీవించే ఒక మామూలు దొంగను, మహర్షి అంటూ ప్రశంసిస్తాడా? దొంగకు రాజ్యాధికారం అప్పగించడం కంటే మూర్ఖత్వం మరేదైనా వుంటుందా? సరే, దొంగను రాజును చేస్తే చేశాడు. తను సన్యాసం ఎందుకు స్వీకరించినట్టు? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు వసంతవర్మ మాటతీరూ,ప్రవర్తనాసరళీ చూస్తూంటే, అతడు సంస్కారవంతుడనీ, ప్రకృతి సౌందర్యాన్ని చూసి పరవశించిపోయే కళాహృదయం కలవాడనీ తెలుస్తున్నది. దీన్ని మనం అతడి సహజ నైజంగా గుర్తించాలి! ఇలాంటి వ్యక్తులు జీవితంలో కొన్ని కొన్ని, సందర్భాలలో తాత్కాలికంగా మానసికమైన బలహీనతలకు లొంగిపోతారు. అంత మాత్రాన దాన్ని మతిభ్రమ అనడం సరికాదు. ఈ చరాచర సృష్టి సమస్తం, ప్రకృతి ధర్మానికి లోబడి నడుస్తున్నదన్న సత్యం, అందరెరిగినదే. అయితే, యవ్వన ప్రలోభానికి వశుడైపోయిన వసంతవర్మకు గజదొంగ తన ప్రాణాన్ని పణంగా పెట్టి అన్న మాటలతో గాని కనువిప్పు కలగలేదు. అది జరిగాక, సాహసం, సంస్కారం, త్యాగనిరతి మూర్తీభవించిన గజదొంగను మహర్షి అని సంబోధించి, సింహాసనాన్ని అప్పగించాడు. ఆ తర్వాత, అనివార్యమైన మరణాన్ని చిరునవ్వుతో ఆహ్వానించడమే, జీవితపరమార్థం అని గ్రహించి, సన్యాసం స్వీకరించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. --(కల్పితం)

[ఆధారం : ఆర్.పట్టాభిరామరాజు రచన]



# తగిన పరిష్కారం

నాగలాపురం అనే గ్రామంలో, పేదరైతులకు అప్పులిచ్చే చిన్నశెట్టి, చాలా తక్కువ కాలంలోనే ధనవంతుడైపోయి, నాలుగంతస్థుల మేడ కట్టాడు. ఇది చూసి అదే గ్రామం వాడైన పెద్దశెట్టికి కన్ను కుట్టింది. చిన్నశెట్టి వడ్డీకింద నూటికి ఇరవై, పాతికా పేదల నుంచి గుంజుతున్నాడు.

పెద్దశెట్టి, చిన్నశెట్టి వడ్డీవ్యాపారం పడగొట్టాలని, గ్రామాధికారి వద్దకుపోయి, చిన్నశెట్టి వసూలు చేస్తున్న వడ్డీ పరమ అన్యాయమంటూ ఆయనకు చెప్పాడు. అయితే, చిన్నశెట్టి నుంచి చిన్నాపెద్దా సహాయాలు పొందుతున్న గ్రామాధికారి నవ్వి వూరుకున్నాడు.

పెద్దశెట్టి తిన్నగా రాజుగారి దగ్గిరకు వెళ్ళి, చిన్నశెట్టి ధనదాహం గురించీ, గ్రామాధికారి అసమర్థత గురించీ ఆయనకు చెప్పాడు.

అంతా విన్న రాజు, "సరే, మీ గ్రామంలో ఒక పాఠశాల పెట్టిస్తాను. దానికి వ్యవహార జ్ఞానంతోపాటు, నిజాయితీపరుడైన ఉపాధ్యాయుణ్ణి నియమిస్తాను. ఇక వెళ్ళు!" అన్నాడు.

"అదేమిటి, ప్రభూ! చిన్నశెట్టి దురన్యాయం గురించీ, అతడితో చేయి కలిపిన గ్రామాధికారి సంగతీ విన్నవిస్తే, పాఠశాల పెట్టిస్తానంటారేమిటి? పాఠశాల కావాలని నేనడగలేదే!" అన్నాడు పెద్దశెట్టి ఆశ్చర్యపోతూ.

అందుకు రాజు నవ్వి, "మీ గ్రామ ప్రజలు చదువుసంధ్యల్లేని అమాయకులు కావడంతో, చిన్నశెట్టిలాంటి వాళ్ళ చేతుల్లో మోసపోతున్నారు. చిన్నశెట్టిని దండిస్తే, మరొక బుల్లిశెట్టి వాళ్ళను మోసం చెయ్యవచ్చు. దీనికి తగిన పరిష్కారం ప్రజలు విద్యావంతులయి, మోస పోకుండా వుండేందుకు తగినశక్తి సంపాయించడం ఒక్కటే! అందువల్ల, మీ గ్రామానికి పాఠశాల అవసరం. నువ్వింక నిశ్చింతగా వెళ్ళిరా!" అని చెప్పాడు. —యస్.లోకేశ్వరి



# చందమామ అనుబంధం-51




మనదేశపు పక్షులు-జంతువులు :

## వదరుపిట్టలు

సాధారణంగా పక్షులు రాత్రిపూట నిశ్శబ్దంగా ఉంటాయి. అయితే, వదరుపిట్టలు మాత్రం అప్పుడప్పుడు బిగ్గరగా అరుస్తాయి. తమను పట్టుకోవడానికి వచ్చే శత్రువులను భయపెట్టడానికే ఇవి ఇలా అరుస్తాయని చెబుతారు. పక్షులన్నిటిలోకీ ఎక్కువగా వాగేవి కూడా ఈ వదరుపిట్టలే.

ఎక్కడికి వెళ్ళినా ఒకటిగా కలిసి వెళ్ళడం, ఈ పిట్టల ప్రత్యేకగుణం. ఆహారంకోసం ఒకటిగానే బయలుదేరతాయి. కలిసే గుడ్లుపెడతాయి; పిల్లలను పొదిగి పెంచుతాయి. ఒక పిట్ట ఈకలను మరొక పిట్ట శుభ్రం చేస్తుంది. ఒక పిట్టను పంజరంలో బంధించామంటే మిగతా పిట్టలన్నీ వచ్చి చుట్టుముడతాయి. ఎందుకు? పంజరంలోని పిట్టను విడిపించడానికా అంటే, కాదు. ఆ పిట్టతోపాటు తాము కూడా పంజరంలో చేరడం కోసమే. సాధారణంగా ఆరు, ఏడు పిట్టలు కలిసి ఒక గుంపుగా నివసిస్తాయి.

అడవి వదరుపిట్టలు దాదాపు 10 అంగుళాల (25 సెం.మీ.)పొడవు ఉంటాయి. మనక ఊదారంగులో ఉండే వీటి శరీరం అడుగుభాగం లేత పసుపుపచ్చ-బూడిద రంగులో ఉంటుంది. వీటి కనుగుడ్లు లేతపసుపు చారలతో తెల్లగా ఉంటాయి. ముక్కూ, కాళ్ళూ ఉల్లిపాయ లేతఎరుపు రంగులో ఉంటాయి.

ఇవి చాలా అరుదుగానే ఎత్తులో ఎగురుతాయి. గుబురు ఆకులుగల చెట్ల కొమ్మలలో గూళ్ళు కడతాయి. ఉత్తర భారతదేశంలోకన్నా, దక్షిణాదిలోని ఈ పిట్టలు కాస్త పెద్దవిగా ఉంటాయి. వీటివల్ల అడవులకు ఒక జీవకళ వస్తుంది!

# మన సమకాలీన సాహిత్యం

ప్రత్యేకమైన ఇతివృత్తం అంటూ లేకుండానే నవల ఉంటుందా? ఉండవచ్చు. సుప్రసిద్ధ మలయాళ రచయిత వైక్కం మహమ్మద్ బషీర్ రచించిన 'పాతుమ్మయూడె ఆడు' అనే నవలను చదివినట్టయితే ఈ మాటను మీరూ అంగీకరిస్తారు.

రచయిత స్వయంగా చెబుతున్నట్టు నడుస్తుందీ నవల. అనేక సంవత్సరాలు అక్కడక్కడా సంచార జీవనం గడిపి, ఆఖరికి స్వగ్రామంలోనే స్థిరపడాలని ఇంటికి తిరిగివస్తాడు రచయిత. ఆనాటికే ఆయన చాలా నవలలు రచించి రచయితగా

## వైక్కం మహమ్మద్ బషీర్ 'పాతుమ్మయూడె ఆడు'

ప్రసిద్ధుడయి ఉంటాడు.

అయితే వాళ్ళ ఇల్లు చిన్నది. ఇంటినిండా మనుషులు. రచయిత తల్లీ, భార్యాపిల్లలతో ఇద్దరన్నదమ్ములు; చెల్లెలు, ఆమె భర్త; పెళ్ళి కావలసిన కడగొట్టు తమ్ముడు. వీళ్లకుతోడు పిల్లులూ, ఎలుకలూ, కోళ్ళూ. వీటన్నిటితో ఇల్లు పొద్దస్తమానం హడావుడిగా, గందరగోళంగా ఉంటుంది. ఇవన్నీ చాలవన్నట్టు ఇంట్లో ఎక్కడపడితే అక్కడ విచ్చలవిడిగా తిరుగుతూ ఉంటుంది ఒక మేక!

ఒకనాడు ఆ మేక తన పడకమీదికి లాఘవంగా ఎక్కి, తాను రాసిన రెండు పుస్తకాలను ఆసక్తితో నమలడం చూసి రచయిత ఆశ్చర్యపోతాడు. అయినా, దానిని తరమకుండా అలాగే ఓర్పుగా చూస్తూ ఉండిపోతాడు. అయితే, ఆ మేక అంతటితో తృప్తి చెందకుండా తాను యాభైరూపాయలు పెట్టి కొన్న దుప్పటిని రుచి చూడడానికి పూనుకోవడం చూస్తూ ఊరుకోలేక పోతాడు!

ఈ నవల ఆద్యంతం ఈ మేక ప్రస్తావన వస్తుంది. అది అదే గ్రామంలో ఉంటున్న రచయిత సోదరి పాతుమ్మది. ఒక్కొక్కసారి అది చాలా విచిత్రమైన పరిస్థితులను



సృష్టిస్తుంది. ఆ విధంగా ఒకసారి ఆ మేక తలను హాయిగా ఒక మట్టికుండ లోకి దూర్చి, వెలుపలికి తీయకుండా-- కుండను పగులగొట్టి ఆ సమస్యను పరిష్కరించే బాధ్యతను ఇతరులకు వదిలిపెడుతుంది!

ప్రశాంత వాతావరణంలో తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించాలన్న రచయిత కల త్వరలోనే చెదిరి పోతుంది. ఆయన తల్లీ, అక్కచెల్లెళ్ళూ, బంధుమిత్రులూ ఆయన నుంచి ధనసహాయం ఆశిస్తారు. అయితే, ప్రతి ఒక్కరు కూడా ఆ విషయం మరొకరికి తెలియకూడదని జాగ్రత్తపడతారు.

పాతుమ్మకు మరొక ఆశ: ఆమె మేక త్వరలోనే ఈనుతుంది. అప్పుడది బోలెడంత పాలిస్తుంది. ఆ పాలు అమ్మి కావలసినంత సొమ్ము కూడబెట్టవచ్చు!

ఆఖరికి మేక అందమైన తెల్లపిల్లను ఈనుతుంది. అయితే, బంధువులే దొంగతనంగా మేకనుంచి పాలుపితకడం ప్రారంభిస్తారు. అయినా, దొంగిలించిన పాల నుంచి కుటుంబ సభ్యులందరికీ కూడా టీకి కావలసిన పాలు వస్తూ ఉంటాయి.

ఈ చిన్న నవలలోని మిగతాభాగం రచయిత చిన్ననాటి ముచ్చట్లనూ, బంధుమిత్రుల విచిత్ర ప్రవర్తననూ తెలియజేస్తుంది. బంధువు ఒకాయన– తన అవసరాలు తీర్చకపోతే వెళ్ళి మిలిటరీలో చేరిపోతానని మాటిమాటికీ బెదిరిస్తూ ఉంటాడు. ఒకసారి స్థానిక పాఠశాల విద్యార్థినులు కొందరు రచయితకేసి చూస్తారు. గొప్ప రచయితనైన తనను చూస్తున్నారని ఒక క్షణం మురిసిపోతాడాయన. అయితే, ఆ అమ్మాయిలు చూసింది తనను కాదనీ, తన వెనక ఉన్న విరగకాసిన ఫలవృక్షాన్ననీ అతడు కొంతసేపటికి గ్రహిస్తాడు పాపం!

సున్నితమైన హాస్యంతో హాయిగా సాగే ఈ నవల కేరళ ప్రాంతంలోని ఒక సాధారణ ముస్లిం కుటుంబానికి దర్పణం పడుతుంది. పేద ప్రజల బ్రతుకులలోని చిన్న చిన్న ఆశలనూ, విశ్వాసాలనూ తెలియజేస్తుంది.

సమకాలీన మలయాళ కథా సాహిత్య మార్గదర్శకులు వైక్కం మహమ్మద్ బషీర్. ఆయన 1910వ సం॥లో జన్మించారు.

# మీకు తెలుసా?

1. మన దేశానికి ఢిల్లీ రాజధాని ఎప్పుడయింది? అంతవరకు మన రాజధాని ఏది?
2. రొడీషియా నూతన నామం ఏది?
3. అతి ప్రాచీనమైన క్రీడ ఏది?
4. భారత జాతీయ కాంగ్రెస్ ప్రధమ మహిళా అధ్యక్షులు ఎవరు?
5. మొట్టమొదటి 'రోబోట్'ను ఎప్పుడు రూపొందించారు?
6. 'జైహింద్' నినాదాన్ని సృష్టించినవారెవరు?
7. భారత ఉపాధ్యక్షుడు నిర్వహించే మరొక పదవీబాధ్యత ఏది?
8. జీబ్రాల ప్రత్యేక లక్షణం ఏమిటి?
9. 'రాజతరంగిణి' ఏ రాజుల చరిత్రను తెలియజేస్తుంది?
10. భారతదేశంలో మొట్టమొదటి తపాలా బిళ్ళను ఎప్పుడు విడుదల చేశారు?
11. ఏ చాక్లెట్ సంస్థ ఒక గ్రామాన్ని సొంతంగా రూపొందించింది?
12. ఇటలీ జాతీయ పుష్పం ఏది?
13. 'గీతాగోవిందా'న్ని రచించిన వారెవరు?
14. 'దాస్ కేపిటల్' (పెట్టుబడి) ప్రపంచ మహాగ్రంథాలలో ఒకటి. దానిని రచించిన వారెవరు?
15. అమెరికా అధ్యక్షుడు నివసించే 'వైట్‌హౌస్'కు ఎందుకు తెలుపు రంగు వేశారు?

## సమాధానాలు

1. 1911, కలకత్తా.
2. జింబాబ్వే.
3. పోలో. క్రీ.శ. మొదటి శతాబ్దంలో పర్షియాలో ఈ ఆట ఆడేవారు.
4. డా॥ అనీబిసెంట్.
5. 1962లో అమెరికాలోని యూనిమేషన్ సంస్థ రూపొందించింది.
6. నేతాజీ సుభాస్ చంద్రబోస్.
7. రాజ్యసభ అధ్యక్షపదవి.
8. ఏ రెండు జీబ్రాలకుగాని ఒకే రకం చారలుండవు.
9. కాశ్మీర రాజులు.
10. 1852లో.
11. కాడ్‌బరీ - బోర్న్‌విల్లేలో.
12. కలువ.
13. జయదేవుడు.
14. కార్ల్‌మార్క్స్.
15. అగ్నిప్రమాదంలో ఏర్పడిన మచ్చలను కప్పడానికి.




# శివయ్య పశ్చాత్తాపం

ఐనవరం అనే గ్రామంలో, శివయ్య అనే ధనికుడుండేవాడు. ఆయనకు ఒక్కగానొక్క కుమార్తె, ఆమెపేరు మందాకిని.

మందాకిని గొప్ప సౌందర్యవతి. ఆస్తి పాస్తులూ, అందచందాలూ వున్న ఆమెను పెళ్ళాడాలని సంపన్న కుటుంబాల యువకులు కొందరు ముందుకొచ్చారు. అయితే, ఆమె తన తండ్రి దగ్గిర ఎంతో కాలంగా పని చేస్తున్న రామచంద్రం అనే యువకుణ్ణి ప్రేమించి, అతణ్ణి పెళ్ళాడాలన్న ఆలోచనలో వున్నది.

రామచంద్రం అందమైనవాడు. అమాయకుడు. అతిమంచివాడు. అబద్ధం ఆడడం అంటే, అతడి దృష్టిలో హత్య చేసినంత పాపం. నా అన్నవారు ఎవరూ లేని అతను, చాలాకాలంగా శివయ్య దగ్గిర వుంటూ, అన్ని విషయాల్లోనూ ఆయనకు చేదోడు వాదోడుగా వుండేవాడు.

శివయ్య, మందాకినికి తగిన వరుణ్ణి చూసే ప్రయత్నంలోవుండగా, ఆమె తండ్రికి తాను రామచంద్రాన్ని వివాహం ఆడదలచినట్టు చెప్పేసింది. ఇది విన్న శివయ్య, ముందు నిర్ఘాంతపోయి, తర్వాత మందాకినిని గట్టిగా మందలించాడు.

తన దగ్గిర పనిచేసేవాణ్ణి అల్లుడిగా చేసుకోవడం, శివయ్యకు పెద్ద అవమానంగా తోచింది. ఆయన బాగా ఆలోచించి రామచంద్రం మీద లేనినింద మోపి, పనిలోనించి తీసివేశాడు.

జరిగిన దానికి, రామచంద్రం బాధపడుతూ గ్రామం వదిలి వెళ్ళాక, శివయ్య భార్యా, కూతురూ ఆయన్ని నానామాటలూ అన్నారు. మందాకిని, తను రామచంద్రాన్ని తప్ప మరెవర్నీ పెళ్ళాడనని పట్టుపట్టింది. ఇందుకు తల్లి తన పూర్తి అంగీకారాన్ని తెలిపింది. చేసేదిలేక శివయ్య రామచంద్రం

రావినూతల సువర్ణాకన్నన్

కోసం వెతికించాడు. కాని అతడి జాడ కనిపించలేదు. ఇదీ ఒకరకంగా మేలే అనుకుంటూ శివయ్యలోలోపలసంతోషించాడు.

ఇలా రేండేళ్ళు గడిచాయి. తనకు అన్ని పనుల్లోనూ పక్కన వుండి సాయపడే రామచంద్రం దూరమవడం, కూతురు పెళ్ళికి ఒప్పుకోకపోవడం, శివయ్యకు పెద్ద దిగులుగా పరిణమించి, క్రమంగా ఆయన ఆరోగ్యం కోల్పోసాగాడు.

ఇది గమనించిన శివయ్య భార్య, కూతురుకు రకరకాలుగా నచ్చచెప్పి, ఎలాగైతేనేం పెళ్ళికి ఒప్పించింది. ఈ వార్త చెవిన పడగానే శివయ్య పరమానందం చెంది, మందాకినికి సంబంధాలు వెతకడం ప్రారంభించాడు.

ఇలాంటి సమయంలో, దూరగ్రామంలో వున్న ధర్మయ్య అనే కోటీశ్వరుడి కొడుకు సంబంధం వచ్చింది. శివయ్య, ఒక పెద్ద మనిషిని వెంటబెట్టుకుని, ధర్మయ్య వుండే గ్రామానికి వెళ్ళాడు. అయితే, ఆ సమయంలో ధర్మయ్య కొడుకు ఇంట్లో లేడు.

ధర్మయ్య, శివయ్యకు అన్ని మర్యాదలూ చేసి, "మా అబ్బాయికి కబురు చేస్తాను. నాకు వ్యవసాయంతో పాటు వ్యాపారం కూడా వున్న సంగతి, మీరు వినే వుంటారు. మావాడికి ఎప్పుడూ ఒకే వ్యాపారం ధ్యాసే!" అని కొత్తగా ఉద్యోగంలో పెట్టుకున్న గుమాస్తాను పిలిచాడు.

ఆ వచ్చిన వాణ్ణి చూసి శివయ్య ఆశ్చర్యపోయాడు. కారణం, అతను రామచంద్రం.



హఠాత్తుగా అతనక్కడ కనబడేసరికి, శివయ్యకు గుండెల్లో రాయిపడినట్టయింది. రామచంద్రం నవ్వుతూ శివయ్యను పలకరించి, పేరుపేరునా అందరి క్షేమం అడిగాడు.

ఇది చూసి ధర్మయ్య, "ఇతణ్ణీమధ్యే పనిలో పెట్టుకున్నాను. లోగడ మీ దగ్గిర పనిచేశాడన్నమాట!" అని శివయ్యతో అని, రామచంద్రంతో, "వెంటనే వెళ్ళి, అబ్బాయిని పిలుచుకురా!" అన్నాడు.

ఇందుకు రామచంద్రం తాపీగా, "ఆయన ఇప్పుడు రారండి," అన్నాడు.

"వస్తాడు, ఎందుకురాడు? ఆ వ్యాపార విషయాలూ అవీ తర్వాత నిదానంగా చూసుకోవచ్చు, ముందు రమ్మను. పెళ్ళిచూపులకు వచ్చారని చెప్పు!" అన్నాడు ధర్మరాజు సైగచేస్తూ. కాని అది గమనించని రామచంద్రం, "ఆయనగారీ సమయంలో నీలవేణమ్మ ఇంట్లో వుంటాడండి. ఒకవేళ ఆయన బయలుదేరినా, ఆవిడ కదలనియ్యదండి," అన్నాడు.

"ఎవరీ నీలవేణి?" అంటూ అనుమానంగా చూశాడు శివయ్య.

ధర్మయ్య ఏదో సర్ది చెప్పబోయేంతలో, రామచంద్రం కల్పించుకుని, "ఆ నీలవేణమ్మ, మంజువాణమ్మ కూతురు. ఆ మధ్య బాబుగారు ఏదో పానీయం కాస్త అతిగా పుచ్చుకుని, వీధిలో పడిపోతే, ఆ తల్లీకూతుళ్ళు వాళ్ళ ఇంట్లోకి తీసుకుపోయి ఆయనకు ఎన్నో సేవలు చేశారు. బాబుగారు



తన కాబేయో అల్లుడని మంజువాణమ్మ ఆ వీధిలో అందరికీ చెబుతూంటుంది," అన్నాడు.

ఇది వింటూనే శివయ్యకు విషయం పూర్తిగా అర్థమయింది. నోట మాట పెగలక, రామచంద్రం కేసి రౌద్రంగా చూస్తున్న ధర్మయ్యతో ఏమీ అనకుండా, శివయ్య వెంటవచ్చిన పెద్దమనిషితోసహా వీధిలోకి వచ్చాడు.

ఇంతలో ధర్మయ్య పూనకం వచ్చిన వాడిలా పెద్దగా అరుస్తూ, రామచంద్రం మెడపట్టుకుని వీధి వాకిలి మెట్లవరకూ లాక్కొచ్చి, "ఒరే, బుద్ధిలేని వెధవా! నిన్ను పనిలో పెట్టుకుని కొరివితో తలగోక్కున్నాను. ఫో, ఇక్కణ్నుంచి!" అంటూ మెట్ల మీది నుంచి వీధిలోకి తోశాడు.

ఆ తోపుకు బోర్లా కిందపడబోతున్న రామచంద్రాన్ని, శివయ్య రెండు చేతులతో పట్టుకుని, "రామచంద్రా! ఇక పద, మనింటికి పోదాం," అన్నాడు ఎంతో ఆప్యాయంగా.

మెట్ల మీద నిలబడి ధర్మయ్య ఆయాస పడుతూ, "వాడి మాటలు నమ్మకండి!" అన్నాడు.

శివయ్య చిన్నగా నవ్వి, "ఈ రామచంద్రం ఎంత మంచివాడో, నేను తప్ప ఇంట్లో అందరూ గ్రహించారు. ఇప్పుడు నేనూ గ్రహించాను. వీడు ప్రాణం పోయినా అబద్ధం ఆడడని, నాకు తెలుసు. వీణ్ణి అన్యాయంగా ఇంట్లోంచి తరిమేశాను. అందుకు పశ్చాత్తాప పడుతున్నాను. కాని వీడు మాత్రం, నాకూతురు జీవితం బుగ్గి పాలుకాకుండా కాపాడాడు. ఇప్పుడు వీణ్ణి నౌకరుగా కాదు, నాకాబోయే అల్లుడిగా ఇంటికి తీసుకుపోతున్నాను, సెలవు!" అంటూఅక్కణ్ణించి తనగ్రామానికి బయలుదేరాడు.

జరిగిందంతా విన్న శివయ్యభార్య చాలా సంతోషించింది. మందాకిని ఆనందానికి అవధులు లేవు. ఒక శుభముహూర్తాన శివయ్య, తన కూతుర్ని రామచంద్రానికిచ్చి ఘనంగా వివాహం జరిపించాడు.






పూర్వం రష్యాలో ఒకముసలావిడ ఉండేది. ఆవిడకిద్దరు కుమారులుండే వారు. వారిలో ఒకడు చనిపోయాడు. రెండవ వాడు దూర దేశం ప్రయాణమై వెళ్ళాడు.

వాడు వెళ్ళిన మూడు రోజులకే ముస లావిడ ఇంటికి ఒక సిపాయివచ్చి, "అవ్వా, చీకటి పడుతున్నది, ఈ రాత్రికి మీ ఇంట్లో పడుకోనిస్తావా?" అని అడిగాడు.

"అలాగేలే నాయనా. అయితే, నువ్వు ఎక్కణ్ణుంచి వస్తున్నావు?" అని అడిగింది ముసిలావిడ.

"నేను ఆలోకం నుంచి వస్తున్నాలే!" అన్నాడు సిపాయి.

"నిజంగానా! నా కొడుకు ఈ మధ్యనే పోయాడు. వాడుగాని నీకక్కడ కనపడలేదు గద?" అని అడిగింది ముసలావిడ.

"కనబడకేం? అతనూ, నేనూ ఒకే గదిలో ఉండేవాళ్ళం," అన్నాఢు సిపాయి.

"నిజంగానా!" అన్నది ముసలావిడ చాలా ఆదుర్దాగా.

"మీ వాడు ఆ లోకంలో కొంగలను కాస్తు న్నాడవ్వా!" అన్నాడు సిపాయి.

"అయ్యో, పాపం! మావాడెంత కష్టపడి పోతున్నాడో?" అన్నది ముసలమ్మ.

"కష్టం కాదా, అవ్వా? కొంగలంటే ఎటు వంటివనుకున్నావు? ముళ్లపొదల మధ్యకి పారిపోతాయి," అన్నాడు సిపాయి.

"ఇంకేం? వాడి బట్టలన్నీ కొ్రుపట్టి ఉంటాయి!" అన్నది ముసలమ్మ.

"అతని బట్టలన్నీ పీలికలూ, వాలికలూ అయ్యాయంటే నమ్ము," అన్నాడు సిపాయి.

"నా దగ్గిర నలభై గజాల తానూ, కొంత డబ్బూ ఉన్నది, వాటిని తీసుకు పోయి వాడికిస్తావా?" అని అడిగింది ముసలమ్మ.

"అలాగేలే,అవ్వా," అని వాడారాత్రి ముస లమ్మ ఇంటపడుకుని మర్నాడు బట్టల

రష్యా జానపద కథ



తానూ, డబ్బూ తీసుకుని తనదారిన తాను వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన కొంతకాలానికి, దూరదేశం వెళ్ళిన ముసలమ్మకొడుకు తిరిగివచ్చాడు.

"ఒరే, నాయనా, నువ్వు వెళ్ళిన సమయంలో ఆ లోకం నుంచి ఒకడు వచ్చాడు. చచ్చిపోయిన నీఅన్నవిషయాలన్నీచెప్పాడు. ఇద్దరూ ఒకగదిలోనే ఉంటున్నారుట. మీ అన్నకివ్వమని ఒక బట్టలతానూ, డబ్బూ ఇచ్చి పంపించా," అన్నది ముసలమ్మ తన రెండో కొడుకుతో.

"చాలా గొప్పపని చేశావు! నిన్ను అమాయకురాలిని చేసి ఎవడో దోపిడీ చేశాడు. నీ వంటి అమాయకులు ప్రపంచంలో ఇంకా ఎందరున్నారో చూసి, నా తెలివితేటలు వాళ్ళ మీద చూపిస్తాను," అంటూ ముసలమ్మ కొడుకు బయలుదేరాడు.

పోగాపోగా ఒక గ్రామం వచ్చింది. ఆ గ్రామం జమీందారు భవంతి పక్కన వున్న పశువులశాల ముందు ఒక ఆడపందీ, దాని పిల్లలూ మేత తింటున్నాయి. ముసలమ్మ కొడుకు ఆడపంది ముందు మోకరించి నేలకు వంగి నమస్కారం చేశాడు.

ఇదంతా భవంతి కిటికీనుంచి చూస్తున్న జమీందారు భార్య, తన దాసీని పిలిచి, "వాడు ఎందుకట్లా నమస్కారం చేస్తున్నాడో విచారించి రావే!" అని పంపింది.

దాసీది వచ్చి ముసలమ్మకొడుకుతో, "మా పందిముందు సాష్టాంగ పడుతున్నావేం?" అని అడిగింది.

"చల్లనితల్లీ; ఈ పంది నా భార్యకు వేలువిడిచిన బంధువు. రేపు నా కొడుకు పెళ్ళి. పెళ్ళిపెత్తనం చెయ్యడానికి పందినీ, తోడుపెళ్ళికూతుళ్ళుగా పందిపిల్లల్నీ పంపుతారేమో కాస్త అమ్మగారి నడిగివస్తావా?" అన్నాడు ముసలమ్మ కొడుకు.

దాసీ చెప్పిన మాటలు విని జమీందారు భార్య, "పెళ్ళికి పందుల్ని పిలుచుకుపోవచ్చాడా? ఎంత వెర్రివాడూ! సరేకానీ, వాణ్ణి చూసే నవ్వుతారు, మనకేం? ఆ పందికి నా ఉన్నికోటును తొడిగి, పిల్లలతో సహా గుర్రబ్బండిలో పంపించు!" అన్నది నవ్వుతూ.

గుర్రాలను బండికి పూన్చి, పందినీ, పిల్లల్నీ అందులో కూచోబెట్టి, బండీని ముసలమ్మ కొడుక్కు వప్పగించారు. వాడు బండి తోలుకుంటూ ఇంటికి బయలుదేరాడు.

వేటకు పోయిన జమీందారు ఇంటికి తిరిగిరాగానే జమీందారు భార్య నవ్వుతూ, "అయ్యో, నవ్వలేక చచ్చాం! ఇక్కడికొక కాపువాడు వచ్చి మన ఆడపందికి వంగి, వంగి, వంగి దణ్ణాలు పెట్టసాగాడు. ఏమిట్రా అంటే ఆ పంది తన భార్యకు వేలువిడిచిన బంధువనీ, దానిని తన కొడుకు పెళ్ళికి పెత్తనంచెయ్యటానికీ, తోడుపెళ్ళికూతుళ్ళుగా పందిపిల్లల్నీ తనవెంట పంపమన్నాడు," అన్నది.



"ఇంకేం? నువ్వు పంపావు, అవునా?" అన్నాడు జమీందారు.

"అవును. పందికి నా ఉన్నికోటు తొడిగి పిల్లలతోసహా గుర్రబ్బండిలో ఎక్కించి మరీ పంపాను," అన్నది భార్య.

"వాడెక్కడ ఉంటాడు?" అని అడిగాడు జమీందారు.

"నాకేం తెలుసునండీ?" అన్నది భార్య.

"మతిలేనిదానవు నువ్వు, వాడు కాడు!" అంటూ జమీందారు తన గుర్రం ఎక్కి బయలుదేరాడు. గుర్రపుడెక్కలచప్పుడును బట్టి ముసలమ్మకొడుకు తనవెంట ఎవరో పడ్డట్టు పసికట్టాడు. బండిని దట్టమైన అరణ్యంలోకి తోలి, తాను బాటమీదికి వచ్చి, తన టోపీని నేలమీద పెట్టి, దాని పక్కనే కూచున్నాడు.

ఇంతలో జమీందారు అక్కడికి వచ్చి, "ఏయ్, కుర్రవాడా? గుర్రబ్బండిమీద పందినీ, పిల్లల్నీ ఎక్కించుకుని ఇటుగా ఎవడన్నా పారిపోవటం నువ్వు చూశావా?" అని ముసలమ్మ కొడుకును అడిగాడు.

"చూశాను దొరా. వాడు వెళ్ళి చాలా సేపాయె!" అన్నాడు ముసలమ్మకొడుకు.

"వాణ్ణిపట్టుకోవాలి. ఎటుగా వెళ్లాడూ?" అని అడిగాడు జమీందారు.

"వాణ్ణి మీరు పట్టుకోలేకేం? పోనీ, మీకీ ప్రాంతాల అడ్డదార్లు తెలుసా?" అన్నాడు ముసలమ్మకొడుకు.

"ఒరే, నువ్వు చాలా మంచివాడివిగాని, కాస్త నువ్వువెళ్ళి వాణ్ణి పట్టుకురా!" అన్నాడు జమీందారు.

"నేనాండీ? నావల్లకాదండీ! నా టోపీ కింద డేగ ఉన్నది. దానికి కాపలా కాస్తు న్నాను," అన్నాడు ముసలమ్మ కొడుకు.

"నీ డేగను నేను చూస్తూంటాలే," అన్నాడు జమీందారు.

"అది పోయిందంటే యజమాని నా పీక కోసేస్తాడు," అన్నాడు ముసలమ్మ కొడుకు భయపడుతూ.

"దాని ఖరీదెంత?" అన్నాడు జమీందారు.

"మూడువందలకు తగ్గదు," అన్నాడు ముసలమ్మ కొడుకు.

"ఇంకేం? అది పోతే దాని ఖరీదు నేను ఇచ్చుకుంటాలే!" అన్నాడు జమీందారు.

"మాటలకేం? ఎన్నయినా చెప్పొచ్చు!" అన్నాడు ముసలమ్మ కొడుకు.

"నామాటలో నమ్మకం లేదురా? ఇదుగో, నా మాట నమ్మకపోతే మూడు వందలూ తీసుకో!" అన్నాడు జమీందారు.

ముసలమ్మ కొడుకు మూడువందలూ తీసుకుని, జమీందారుగారి గుర్రం ఎక్కి అడవిదారి పట్టి, చెట్లచాటున దాచిన గుర్రబ్బండితోసహా ఇంటకి వెళ్ళిపోయాడు.

జమీందారు గంటల తరబడి కూచున్నా వెళ్ళినవాడి జాడలేదు. ఆ సమయానికి సూర్యాస్తమయంకూడా కాబోతోంది.

"ఈ టోపీకింద నిజంగా డేగ ఉందేమో చూతాం. ఉంటే, వాడు తిరిగి వస్తాడు. లేకపోతే వాడి కోసంకనిపెట్టుకోవటం అనవసరం," అనుకుని జమీందారు టోపీ నేల మీది నుంచి ఎత్తాడు. దానికింద ఏమీలేదు!

"దొంగ వెధవ! నా భార్యను మోసగించిన వాడు, వాడే అయి ఉండాలి!" అనుకుంటూ జమీందారు ఇంటికి బయలుదేరాడు.

ముసలమ్మ కొడుకు జమీందారుగుర్రాన్నీ, బండినీ, పందినీ, పిల్లలనూ, డబ్బునూ ఇంటికి పట్టుకుపోయి తల్లికి చూపించి, "చూశావా అమ్మా? నీకన్న కూడా అమాయకులున్నారు, ప్రపంచంలో! ఇక మనకే లోటూ వుండదు!" అన్నాడు.






హనుమంతుడు శరవేగంతో పోయి, చంద్రసేన వున్నరాణివాసభవనాన్ని చేరుకున్నాడు. ఆ భవనం పచ్చరాతితో, అద్భుతమైన శిల్పంతో నిర్మించబడి ఉన్నది. అంత చీకటిలో కూడా భవనం పచ్చని కాంతులు విరజిమ్ముతున్నది; అక్కడక్కడ తాపిన అందమైన కెంపులు ఎర్రని వెలుతురును ప్రసరిస్తున్నవి.

భవనద్వారం వద్ద రాక్షసులెవరూ కాపలా లేరు. అందరూ కాళికాలయం దగ్గిర జరిగే మహోత్సవంలో పాల్గొనేందుకు వెళ్ళిపోయారు. కాని, ద్వారం ముందు ఎర్రగా మెరుస్తున్న కనుగుడ్లను తిప్పుతూ, కాళ్ళు గల ఒక భయంకరమైన రక్కసిసర్పం తిరుగుతున్నది.

హనుమంతుడు, రక్కసిసర్పాన్నీ, సర్పం హనుమంతుణ్ణీ ఒకేసారిచూడటం జరిగింది. వెంటనే సర్పం బుసలు కొడుతూ ఉవ్వెత్తున లేచింది. దాని ముక్కుపుటాల నుంచి పొగలూ, జ్వాలలూ వెలువడసాగినై. హనుమంతుణ్ణి మింగేందుకు అది నోరు తెరిచి ముందుకు రాసాగింది. హనుమంతుడు, ఆ రక్కసిసర్పాన్ని చంపేందుకు లంఘించబోయేంతలో, భవనం పైభాగం నుంచి కోమలమైన స్త్రీ కంఠం చేసిన ఆర్తనాదం వినిపించింది.

హనుమంతుడు మరుక్షణం సూక్ష్మరూపం ధరించి, రక్కసిసర్పం నోటి గుండా లోపల ప్రవేశించి, దాని పొట్ట చీల్చి చంపి, భవనంలోకి పరిగెత్తాడు. భవనం అంతా



చీకటిమయంగా ఉన్నది. అక్కడక్కడ మాత్రం ఎర్రని కెంపులు చిన్నగా మెరుస్తు న్నాయి. హనుమంతుడు స్త్రీ ఆర్తనాదం వచ్చిన ప్రదేశంకోసందిక్కులు చూసేంతలో, భవనం పైఅంతస్తు నుంచి కొరడా ఛెళు కులూ, ఆర్తస్వరమూ మరొకసారి వినిపిం చాయి.

హనుమంతుడు చప్పున కదిలి చంద్రసేన బంధింపబడి వున్న గది దగ్గిరకుపోయాడు. గది తలుపులు లోపల గడి పెట్టబడి వున్నాయి. హనుమంతుడు ఎత్తుగా వున్న కిటికీ గుండా లోపలికి చూశాడు. అప్పుడే మూర్ఛనుంచి తేరుకున్న చంద్రసేనను కంటకి కొరడాతో కొడుతూ, "ముదనష్టపు దానా! బుద్ధిమాలి మైరావణుడు, మా పాతాళ లంకకు చీడపురుగును తెచ్చినట్టు నిన్ను తెచ్చిపెట్టాడు. కాళికాలయంలోకి ఎవడిని పంపావో చెప్పు? ఇప్పుడే గొడ్డలితో నీ తల నరికివేస్తా. ఉహుఁ, కాదు, గొంతు పిసికి చంపటమే నీకు తగిన శిక్ష!" అంటూ పట్టరాని కోపంతో చంద్రసేన గొంతు పట్టు కున్నది.

హనుమంతుడు వెంటనే తన వాలాన్ని పెంచి కిటికీలోకుండా లోపలికి పంపాడు. కంటకి చంద్రసేన గొంతు నులుము తున్నంతలో, హనుమంతుడి తోక ఆ రాక్షసి మెడను చుట్టి, గట్టిగా బిగించి, ఇవతలికి గుంజింది. కంటకి చాపచుట్టలా నేల మీద పడి, ప్రాణాలు వదిలింది.

హనుమంతుడు గదితలుపులు విరగదన్ని లోపల ప్రవేశించి, చంద్రసేనకు నమస్క రించాడు. తరవాత కొద్ది మాటల్లో పరిస్థితి అంతా ఆమెకు వివరించి, మైరావణుణ్ణి చంపే మార్గం తెలియపరచమన్నాడు.

రాముడి పేరు వింటూనే చంద్రసేన తాను కంటకి వల్ల పడిన హింస అంతా మరిచి, సేదదేరి, "హనుమంతుడా! నీకు మైరావణుడి ప్రాణరహస్యం చెబుతాను. కాని, ముందుగా నువ్వు, ఒక వాగ్దానం చేయాలి. మైరావణ సంహారం జరిగాక, నీ యజమానిని నా దగ్గిరకు తీసుకురావాలి," అన్నది.



హనుమంతుడు అలాగే రాముణ్ణి తీసుకు వస్తానని వాగ్దానం చేశాడు. చంద్రసేన అతడికి మైరావణుడి ప్రాణాలు భద్రపరిచి వున్న చోటు గురించి చెప్పింది. వెంటనే హనుమంతుడు గది బయటికి వచ్చి, ఆకాశంలోకి ఎగిరి, సప్తసముద్ర మధ్యంలో వున్న జ్వాలాముఖి పద్మాన్ని చేరుకున్నాడు. భగ భగ మండే జ్వాలలే ఆ పద్మానికి రేకులుగా వున్నవి. హనుమంతుడు భక్తితో అగ్నిదేవుణ్ణి స్మరించి, పద్మంలో ప్రవేశించి, దాని కాడ గుండా జారి, క్షణంలో మకర బిలాన్ని చేరాడు.

మకరబిలంలో భయంకరమైన సర్పాలు బుసలుకొడుతున్నవి; పిశాచగణాలు హుంకరిస్తున్నవి. హనుమంతుడు పెద్దగా సింహనాదం చేసి, ఆ దుష్టశక్తులను ఎడా పెడా పిడికిళ్ళతో కుమ్ముతూ, కరాళ గుహలోకి పోయాడు. అతడి ధాటి చూసిన భూత శక్తులన్నీ పారిపోయాయి. కాని, గుహ ఎత్తున వున్న ఒకే ఒక్క నల్లని భయంకరాకారం, తెల్లని కోరలతో, ఎర్రని కళ్ళతో అతడి దారికి అడ్డంగా నిలబడి భయానకంగా వికటాట్టహాసం చేసింది.

"ఎవడవురా నీవు? అడ్డం తొలుగు!" అన్నాడు హనుమంతుడు తీవ్రస్వరంతో.

ఆ మాటలకు భయంకరాకారం వికవిక నవ్వి, "నేను బేతాళుడను; భూత, ప్రేత, పిశాచాలకు నాయకుడను! నువ్వెవడివి? ఇక్కడికి రాగలవారు ఇద్దరే. ఒకడు మైరావణుడు— నువ్వు మైరావణుడివి కావు! ఇక పోతే, నీవు ఆ రెండో మహాశక్తిమంతుడవే అయివుండాలి," అన్నది.

హనుమంతుడు బిగ్గరగా నవ్వి, "ఔరా, బేతాళా! శ్మశానాల్లో స్వేచ్ఛగా విహరించే నీకు, ఈ చీకటి గుహలో వుండే దురవస్థ ఎందుకు కలిగింది? ఛీ, అడ్డం తొలగు! లేక పోతే నా శక్తి ఎలాంటిదో ఇప్పుడు నీ మీద చూపవలసి వస్తుంది," అన్నాడు.

బేతాళుడు హేళనగా నవ్వి, "ఏదీ, ఆ శక్తి ఏపాటిదో చూస్తాను!" అన్నాడు.

హనుమంతుడు చప్పున పిడికిలితో బేతాళుణ్ణి పొడిచాడు. ఆ దెబ్బకు బేతాళుడు



నేలకొరిగి, హనుమంతుడికి నమస్కరిస్తూ, "స్వామీ హనుమా! ధన్యుణ్ణి, చిన్న అప చారం చేసి, ఈ గుహలో పడివుండేట్టుగా శాపం పొందాను. నీ స్పర్శతో నాకు శాప విముక్తి కలుగుతుందని శివుడు చెప్పాడు. జై, వీరహనుమా!" అంటూ అక్కడినుంచి మాయమయ్యాడు.

హనుమంతుడు గుహమధ్యకుపోయాడు. అక్కడ ఉన్నతమైన ఒక శిలావేదిక మీద గుండ్రటి రత్నపేటిక ఒకటి ఉన్నది. దాని మూత మీద అగ్నిశిఖ జ్వలిస్తున్నది. అతడు పేటికను సమీపించే సరికి, ప్రచండమైన అగ్నిజ్వాలలు చెలరేగి, అతడి శరీరం కంది పోయేట్లుగా చుట్టుముట్టాయి. వెంటనే హనుమంతుడు గట్టిగా గాలిపీల్చి, మంటల మీదికి ప్రళయమారుతంలాగా ఊదాడు. కాని, మంటలు చల్లారకపోగా, అవి అతణ్ణి మరింత తీవ్రంగా చుట్టుముట్టాయి.

హనుమంతుడు చేతులెత్తి, "అగ్నిదేవా! నేను నీ మిత్రుడైన వాయువు కుమారుణ్ణి, అనుగ్రహించు!" అంటూ అగ్నిని ధ్యానిం చాడు. వెంటనే అగ్ని జ్వాలలన్నీ చల్లారి పోయాయి.

ఆ వెంటనే రత్నపేటిక మీది జ్యోతి నుంచి ఇలా మాటలు వినిపించాయి:

"మారుతీ! నీకు ఒక ముఖ్య విషయం చెప్పేందుకే, నేనిలా విజృంభించాను. నీవు ఈ పేటికలోని తుమ్మెదలను ఒక్కసారిగా సంహరించాలంటే, ఐదు ముఖాలు తెచ్చు కుని, వాటిని నీ నోళ్ళతో లోపలికి పీలుస్తూ, వెనువెంటనే నమిలి వెయ్యాలి. ఆ సంగతి బాగా గుర్తుంచుకో!"

హనుమంతుడు అగ్నికి నమస్కరించి, తుమ్మెదలున్న రత్నపేటికను తీసుకుని వాయువేగంతోరామలక్ష్మణులున్న చోటుకు వచ్చాడు. అక్కడ వాళ్ళిద్దరూ ఇంకా అసంఖ్యాకులైన మైరావణులతో పోరాడు తూనే ఉన్నారు. హనుమంతుడు పెద్దగా సింహనాదం చేస్తూ, మైరావణుడి ఎదురుగా వాలి, నిలబడి, రత్నపేటికను ఎత్తి పట్టుకుని, "ఒరే, పాతాళ లంకేశ్వరా! నీ పంచ ప్రాణా లున్న పేటికను తెచ్చాను. ఇప్పటికైనా బుద్ధి



తెచ్చుకుని, రామలక్ష్మణులను శరణు వేడుకో!" అన్నాడు.

తన పంచప్రాణాలు గల రత్నపేటికను చూసి మైరావణుడు కలవరపడ్డాడు. శరీరం బండరాళ్ళ మధ్య నలిగిపోతున్నట్టు బాధ పడుతూ, "ఎంతపని చేశావురా వానరా! పేటికలో ఉన్నవి నా ప్రాణాలే కాని, అవి రామలక్ష్మణుల పాలిటా, నీపాలిటా మృత్యు వనుకో. ఆ పేటికను తెరిచావో అవి నిన్ను కుట్టి, నీ శరీరాన్ని కాలకూట విషంతో నింపి, నిన్ను నిలువునా దగ్ధం చేస్తాయి. మీ ముగ్గురి మృత్యువునూ ఇక్కడికి మోసు కొచ్చావు. ప్రాణాలమీద ఆశ వుంటే, ఆ పేటికను కిందపెట్టు," అన్నాడు.

హనుమంతుడు ఆ మాటలకు పెద్దగా నవ్వి, "నిద్రలో వున్న రామలక్ష్మణులను మాయతో ఇక్కడికి తెచ్చినందుకు, నీకు చావు తప్పదు. చచ్చేముందు మరేవైనా తెలిసిన మాయమంత్రాలుంటే ప్రదర్శించు," అన్నాడు.

హనుమంతుడి నిర్భయత్వం చూసి, మైరావణుడు బెంబేలుపడిపోతూ, "కంటకీ! కంటకీ! వెంటనే చంద్రసేనను చంపు!" అని బిగ్గరగా అరిచాడు. హనుమంతుడు మందహాసం చేసి, "ఓరి మాయల మైరావణా! ఆ కంటకి నీ కన్న మరి కాస్త ముందు చూపున్న దుర్మార్గురాలు. అది ఇంతకు ముందే చంద్రసేనను చంపే ప్రయత్నం చేసింది. కాని, ఆ సమయంలోనే దాని ఆయువు తీరిపోయింది," అన్నాడు.

మైరావణుడికి జరిగినదంతా అర్థమై పోయింది. అతడు బిగ్గరగా ఒక కేకపెట్టి, అందుబాటులో వున్న ప్రతి ఆయుధాన్నీ బాణంలా ప్రయోగిస్తూ, రామలక్ష్మణుల మీదికి వెళ్ళాడు. అతడు మధ్య మధ్య తన శరీరాన్ని తానే గాయపరుచుకుని రక్తం చిందించుతూంటే, మైరావణులు తండోప తండాలుగా పుట్టుకొచ్చి, రామలక్ష్మణులను చుట్టుముట్టారు. అదిచూసి హనుమంతుడు వెంటనే శివుణ్ణి స్మరించి, ఐదు ముఖాలు తెచ్చుకుని, పంచముఖాంజనేయుడుగా అవతరించాడు.

హనుమంతుడు ఐదు ముఖాలతోనూ ఒకేసారి ప్రళయహుంకారం చేసి, రత్న పేటిక మూత తీయగానే, ఉరుములురిమి పిడుగులు పడినట్టుగా, ఎర్రని మెరుపులతో ప్రళయఝుంకారం చేస్తూ వెలువడిన ఐదు తుమ్మెదలు, అతణ్ణి కాటు వేసేందుకు మీదికి వెళ్ళాయి. హనుమంతుడు ఒక్కొక్క ముఖంతో గట్టిగా లోపలికి గాలి పీలుస్తూ, ఒక్కొక్క తుమ్మెదనూ నోటపట్టి, కసిగా ఏకకాలంలో వాటిని గట్టిగా నమిలి చంపి, నేలమీద ఉూశాడు. మరుక్షణం మాయ మైరావణ మూక అంతా ఈగలలాగా నేల కూలి ప్రాణాలు వదిలారు.




ఈ విధంగా తన బలగమంతా నశించినా, మైరావణుడు పారిపోయే ప్రయత్నం చేయక రామలక్ష్మణుల మీద రకరకాల ఆయుధాలూ, బాణాలూ ప్రయోగించ సాగాడు. అప్పుడు రాముడు ఒక మహాస్త్రం ప్రయోగించి మైరావణుడి తల తెగి నేల మీద పడేలా కొట్టి, అతణ్ణి చంపాడు.

పంచముఖాంజనేయ, రామలక్ష్మణులపై పూలజల్లు కురిసింది. బ్రహ్మాది దేవతలూ, శివుడూ అక్కడికొచ్చారు. బ్రహ్మ రాముడితో, "రామా! ఈ మైరావణుడు కాలనేమి అంశతో జన్మించినవాడు. హనుమంతుడి సాయంవల్ల, నీచేతిలో అతడు చావటం జరిగింది. హనుమంతుడు, శివుడి అంశతో జన్మించినవాడు గనకనే, మైరావణ సంహారానికి అవసరం అయిన, ఆ రత్నపేటికను సప్త సముద్రాల మధ్య నుంచి తేగలిగాడు," అని చెప్పాడు.

శివుడు హనుమంతుణ్ణి ఆశీర్వదించి, "హనుమంతుడా, నీ శక్తియుక్తులూ, బల పరాక్రమాలూ అపారమైనవి. మైరావణ సంహారం మాటలు కాదు! ఎంతో దుర్ఘట మైన ఆ కార్యాన్ని విజయవంతంగా నెరవేర్చావు. మహిమాన్వితమైన పంచ ముఖాంజనేయ రూపాన్ని స్మరించినవారికి, భూత పిశాచాదుల నుంచి ఎటువంటి హానీ కలగదు," అన్నాడు.

హనుమంతుడు తనపంచముఖ స్వరూపాన్ని ఉపసంహరించుకుని, బ్రహ్మకూ,

శివుడికీ ప్రణామాలు చేశాడు. బ్రహ్మ, శివుడూ వారి వెంట వచ్చిన దేవతలూ, రామ లక్ష్మణులకు విజయం కలగాలని ఆశీర్వదించి, వెళ్ళిపోయారు.

బ్రహ్మ వెళ్ళిపోయే ముందు రాముడికి, పాతాళ లంకారాజ్యానికి మత్స్యవల్లభుణ్ణి అధిపతిగా చేయమని ఆదేశం ఇస్తూ, "రామా! సత్యసంధుడూ, ప్రజల సుఖమే తనదిగా భావించి రాజ్యమేలే వాడూ మొదట ఎన్ని కష్టాలు అనుభవించినా, చివరకు అతడికి విజయం తప్పదు. తిరుగులేని, ఈ ధర్మ సూత్రం నీ పట్ల నిజమయింది," అన్నాడు.

బ్రహ్మ చెప్పినదానికి రాముడు పరమానంద భరితుడై, హనుమంతుడికి, వెంటనే మత్స్యవల్లభుణ్ణి పిలిపించవలసిందిగా చెప్పాడు.

త్వరలోనే మత్స్యవల్లభుడు రాముడున్న చోటుకు వచ్చి నమస్కరించాడు. రాముడు అతడికి సంగతి చెప్పి ఆశీర్వదించి పాతాళ లంకావాసుల, ఆనంద కోలాహలాల మధ్య, మత్స్యవల్లభుణ్ణి, పాతాళలంక పాలకుడుగా అభిషేకించి, పట్టాభిషిక్తుణ్ణి చేశాడు.

ఇవన్నీ పూర్తి అయిన తరవాత హనుమంతుడు ఎంతో వినయంగా రాముడికి, తాను చంద్రసేనకు చేసిన వాగ్దానం గురించి చెప్పి, "రామా, ఆ చంద్రసేన సహాయం లేకపోయినట్టయితే, నేను మైరావణుడి ప్రాణాలున్న ప్రదేశం కనుక్కోవటం సాధ్యమయ్యేది కాదు. అప్పటి పరిస్థితుల్లో తప్పని సరి అయినకారణంగా, మైరావణసంహారం తరవాత నిన్ను, ఆమె దగ్గిరకు తీసుకువస్తానని వాగ్దానం చేశాను," అన్నాడు.

ఇది విని, రాముడు ఆశ్చర్యపోతున్నవాడిలా హనుమంతుడి కేసిచూసి, కొంచెం సేపు మౌనంగా ఆలోచించి, తల పంకిస్తూ, "అలాగా! సరే పద," అన్నాడు.

రాముడు ఇలా అనగానే హనుమంతుడు ఎంతో సంతోషపడి, చంద్రసేన ఉన్న మందిరానికి ముందుండి దారి తీశాడు. రాముడు చిరునవ్వు నవ్వుతూ అతణ్ణి అనుసరించాడు.






# సహజగుణం

నాగపట్నంలో గోపాలుడనే వాడుండే వాడు. వాడిది చిన్నప్పటినుంచీ మంచి మనసు. తనచుట్టూ వున్న వారందరూ, తనంత సుఖంగా వున్నప్పుడే వాడు సంతోషంగా వుండగలడు. అందువల్ల పెరిగి పెద్దవుతున్నకొద్దీ వాడిలో ఉపకారగుణం ప్రబలింది. కొందరికి మాటసాయం చేసే వాడు. కొందరికి పనిసాయం చేసేవాడు. కొందరికి ధనసాయం చేసేవాడు.

ఇలా కొంతకాలం, జరిగేసరికి గోపాలుడి ఉపకార గుణానికి విలువ లేకుండా పోయింది. అడిగి అందరికీ సాయపడడం వల్ల, చాలామంది కష్టాల్లో వున్నప్పుడు వాడి వద్దకు వెళ్ళేవారుకాదు సరికదా, వాడొచ్చి అడగలేదని దెబ్బలాడేవారు.

అందరికీ అన్నివేళలా సాయపడ్డం, గోపాలుడు ఒక్కడివల్లా అయేపనికాదు! ఆ కారణంగా ఎవరికైనా సాయం చేయలేనంటే, "నిన్ను నమ్ముకుని అందర్నీ కాదన్నాను. ఎవర్నీ అడగలేదు. ఇప్పుడు నేనేమైపోవాలి?" అని నిలదీసేవారు.

ఇంతేకాక, కొందరు చాటుమాటుగా గోపాలుడి గురించి చెప్పుకుని నవ్వుకునేవారు. ఒక రోజున ఎవరో, "ఆ గోపాలుడికి కట్టుకుపోయేంత డబ్బుంది. అయినా, సొంతానికి వాడుకోడు. పేరు ప్రతిష్ఠలకోసం వాళ్ళకూ వీళ్ళకూ కొంచెం కొంచెంగా సాయం చేసినా, ఇచ్చే డబ్బు తక్కువ. డబ్బెక్కువైతే రెండు చేతులా దానాలు చేయాలి కానీ, ఇలా చిల్లర సాయాలుచేసి ఏమి లాభం?" అనుకోవడం గోపాలుడు విన్నాడు.

ఇది విన్న గోపాలుడి మనసు పాడయింది. వాడు భార్యతో తనువిన్న మాటలు చెప్పి, "నా మంచితనాన్నెవరూ అర్థం చేసుకోవడంలేదు. ఇచ్చిన వాళ్ళకు తృప్తి లేదు.



దానికి గోపాలుడు విచారంగా, "నేను మంచితనాన్నే తప్ప, దేవుడినెప్పుడూ నమ్మ లేదు. తీర్థయాత్రలవల్ల నాకు మనశ్శాంతి కలగదు," అన్నాడు.

"దేవుడిని నమ్మకపోవడం వల్లనే, మీకు మనశ్శాంతి లేకుండా పోయింది. ఒక్కసారి నమ్మిచూడండి, ఎంతహాయిగా వుంటుందో మనసుకు!" అన్నది వాడి భార్య.

అయినా గోపాలుడు అంగీకరించక, "జీవమున్న మనిషికంటే, గుడిలో వున్న రాతిబొమ్మ గొప్పదని నేను నమ్మను. ఈ విషయంలో మాత్రం నన్ను వేధించకు," అన్నాడు.

ఇవ్వనివాళ్ళకు కోపం. నా అవసరంలేని వాళ్ళకు అసూయ, ద్వేషాలూ! ఇక మీదట కొంతకాలంపాటు నేనెవర్నీ పట్టించుకో కుండా ఉండడం మంచిదనుకుంటాను," అన్నాడు.

అందుకు వాడి భార్య నవ్వి, "తనను రక్షించినవాడినైనా సరే తేలు కుట్టకుండా వుండలేదు. రాయి మీదవిసిరిన వాడికి చెట్టు పండునివ్వకుండా వుండలేదు. ఇవి సహజగుణాలు! మీ సహజగుణాన్ని మాను కుని,మీరుసుఖపడలేరు.అయితే ప్రస్తుతం మీకు మనశ్శాంతి లేదు. కాబట్టి కొన్నాళ్ళ పాటు తీర్థయాత్రలు చేసి దైవదర్శనం కావించుకుని తరించి వద్దాం," అన్నది.

వాడి భార్య వెంటనే, "పోనీ, మనిషి రూపంలోని దేవుడినే నమ్మండి. శృంగ వరంలో ఆత్మానందుడనే మహానుభావుడు, తాను దేవుడి అవతారాన్నని చెప్పుకుంటూ ఎన్నో మహిమలు ప్రత్యక్ష నిదర్శనంగా చేసి చూపుతున్నాడట. మీ పెదనాన్నగారబ్బాయి గోవిందుడికి, ఆయనంటే గాఢభక్తి ఏర్ప డిందట. ఆయనకూడా ఒకప్పుడు మీలాగే నాస్తికుడు కదా!" అన్నది.

ఆ మాటలతో గోపాలుడిలో చలనం కలిగింది. గోవిందుడిలో భక్తిభావం ప్రవేశ పెట్టగలిగాడంటే ఆ ఆత్మానందుడు నిజంగా అవతారపురుషుడే అయుండాలి! ఎందుకంటే, గోవిందుడు చిన్నప్పటినుంచీ చెప్పలేనంత స్వార్థపరుడని పేరు. వాడు

మోసం చేసి తమ్ముళ్ళ ఆస్తి కాజేశాడు. లంచాలతో రాజోద్యోగులను మెప్పించి పల్లవరం గ్రామాధికారి అయ్యాడు. ఇప్పుడు వాడు భక్తుడయ్యాడంటే, వాడిలో చాలా మార్పు వచ్చి వుండాలి!

గోపాలుడు ఇలా ఆలోచించి, భార్యతో, "మనం పల్లవరం వెళ్ళి గోవిందుడింట్లో వుందాం. వాడిలో మంచి మార్పు వచ్చి వుంటే, అప్పుడు నేను మనస్ఫూర్తిగా శృంగవరం వెళ్ళి, ఆత్మానందస్వామి దర్శనం చేసుకుని మనశ్శాంతి పొందుతాను," అన్నాడు.

ఇందుకు భార్య సరేనన్నది.



ఇద్దరూ పల్లవరం వెళ్ళారు. వాళ్ళు వెళ్ళేసరికి గోవిందుడింట్లో అట్టహాసంగా పూజ జరుగుతున్నది. ఎందరో భక్తులు పూజలో పాల్గొని భక్తిపారవశ్యంతో పాటలు పాడుతున్నారు.

ఆ తర్వాత అందరూ వెళ్ళిపోయాక గోవిందుడు, గోపాలుణ్ణి కౌగలించుకుని, "మన ఊరిలో నువ్వొక్కడివే నాకు ఆప్తుడివి. మన ఊళ్ళో అంతా నన్ను పైకి రాలేవనితిట్టేవారు. ఆత్మానందస్వామి దయవల్ల, నేనిప్పుడెంత వైభవంగా వున్నానో చూడు!" అన్నాడు.

దానికి గోపాలుడు, "మన ఊళ్ళో నిన్నెవరు తిట్టినా, వాళ్ళకు నీపైన ద్వేషభావం మాత్రం లేదు. నువ్వు అక్రమ మార్గాల్లో నడుస్తున్నావని వాళ్ళ అనుమానం. నువ్వు బాగావున్నట్టే,అక్కడవాళ్లూ బాగానేవున్నారు," అన్నాడు.

గోవిందుడికి కోపంవచ్చినా అణుచుకుని, "అక్కడ వాళ్ళు బాగానే వుండొచ్చు కానీ, నా అంత బాగాలేరు. మన ఊరి వీరయ్య కొడుక్కు రాజు కొలువులో ఉద్యోగం రావలసిందే! మన ఊరివాడని తెలిసి రాజోద్యోగులు నన్ను సలహా అడిగారు. ఒకసారి వీరయ్య నా తమ్ముడి తరఫునచేరి నన్ను నానామాటలూ అన్నాడు. నేనుమర్చిపోతానా?వాడికుద్యోగం రాకుండా చేశానంతే!" అంటూ తన ప్రతాపం చెప్పుకున్నాడు.



గోపాలుడాశ్చర్యపోయి,"నువ్విప్పుడు దైవ భక్తుడివయ్యావుకదా! నీకు రాగద్వేషాలుండ వనుకున్నాను. పాత పగలు గుర్తుపెట్టుకుని ప్రతీకారం తీర్చుకోవడం, నీకు తగునా?" అని అడిగాడు.

వెంటనే గోవిందుడు విసుగ్గా, "పాత పగల సంగతి అలావుంచు! ఈ ఊరికి మొన్నంటే మొన్న, మనూరి శంకరు డొచ్చాడు. వాడి కూతురు కీఊళ్ళో మంచి సంబంధం దొరికింది. శంకరుడు మనూరి వాడని తెలిసి, వాళ్ళు వాడి కూతురు గురించి నన్నడిగారు. నిజం చెప్పొద్దూ— వాడికీ నాకూ ఏనాడూ ఏ గొడవాలేదు. కానీ ఒకసారి ఎవరో వాడి కూతుర్ని, నాకూతు రితో పోల్చి పొగిడి దాని పెళ్ళి నా కూతురి పెళ్ళికంటే ముందవుతుందన్నారు. అంతే! అది నాకు గుర్తుండిపోయింది. నా కూతురి కింకా సంబంధాలు చూస్తున్నాను. ఒక్కటీ కుదరలేదు. అందుకని ఆ పెళ్ళి చెడ గొట్టేశాను. ఆత్మానందస్వామి దయవల్ల ఒక్క రోజు తర్వాత— అంటే నిన్న నా కూతురికి సంబంధం కుదిరింది. అందుకే ఈ రోజు ఇంత ఘనంగా పూజ చేశాను," అన్నాడు.

ఇది విని గోపాలుడు నివ్వెరపోయి, "తొందరపడి ఒక పెళ్ళి సంబంధం చెడ గొట్టినందుకు నీకు బాధగా లేదా?" అని అడిగాడు.

"బాధ నాకెందుకు? అంతా ఆస్వామి లీల. శంకరుడి కూతురుకా సంబంధం రాసిపెట్టి వుంటే, నా కూతురు పెళ్ళి ఇంకో రెండు రోజుల ముందరే కుదిరి వుండేది. అంతా శంకరుడి దురదృష్టం!" అన్నాడు గోవిందుడు.

"నీకు మాత్రమే మంచి చేస్తూ, ఇతరు లకు హాని చేసేవాడు దైవస్వరూపుడవు తాడా? నువ్వు పొగిడే, ఆ ఆత్మానంద స్వామిని శంకరుడు తిట్టడా?" అన్నాడు గోపాలుడు.

గోవిందుడు చిరునవ్వుతో, "ఎవరేమంటే నాకెందుకు? నేనూ, నా కుటుంబం పచ్చగా వుండాలి. నాకు మేలు జరిగినంతకాలం,

ఆత్మానందస్వామి నాకు దేవుడు. నేను నా కోసం ఆయన భక్తుడినయ్యాను తప్ప, ఇతరులకు మేలు జరగాలని దైవభక్తినల వరుచుకోలేదు," అంటూ తన మనసులోని మాటను స్పష్టం చేశాడు.

గోపాలుడికి, ఆ ఇంట్లో ముళ్ళమీద వున్నట్టుగా వుంది. వాడు మర్యాదగా వుండ దని అక్కడ ఒక్కరోజు మాత్రం వుండి, మళ్ళీ ప్రయాణమయ్యాడు. ఉన్న కాసేపూ గోవిందుడు తన గొప్పతనం గురించీ, ఇంకా ఎవరిపై పగతీర్చుకోనున్నదీ, గోపా లుడికి వివరించి చెప్పాడు.

అక్కడి నుంచి తిన్నగా ఇంటికే వెళదా మనుకున్నది, గోపాలుడి భార్య. ఆశ్చర్యంగా గోపాలుడు శృంగవరంలోని ఆత్మానందుడి వద్దకు వెళదామన్నాడు.

ఇందుకు గోపాలుడి భార్య, "మీ పెద నాన్నగారబ్బాయి దైవభక్తుడైనా, అతడిలో స్వార్థం, అహంకారం ఏమాత్రం నశించ లేదు. మానవత్వాన్ని మరిచి ఇతరులపై ద్వేషం పెంచుకుని అపకారం చేస్తున్నాడు. ఆయన్ను చూస్తూంటే నాకే దేవుడి మీద నమ్మకం పోతున్నది. అలాంటిది మీరిప్పుడు ఆత్మానందుడివద్దకు వెళ్ళి ఏం చేస్తారు?" అని అడిగింది.

గోపాలుడు ఒకటి, రెండు క్షణాలు మౌనంగా వూరుకుని తర్వాత, "దైవభక్తి అంటే పలుకుబడికి, ప్రతీకారానికి సాధన కాకూడదు. దురహంకారంతో కూడిన సహజగుణాలు దైవభక్తి అనే అగ్నిలో నశించి పోవాలి. మా గోవిందుడి విషయంలో అలా' జరగలేదు. ఆ ఆత్మానందస్వామి నిజంగా అవతారపురుషుడే! స్వార్థం తప్ప తెలియని గోవిందుడిలో, ఎంతో కొంత దైవభక్తిని ప్రవేశపెట్టాడు. గోవిందుడి సహజగుణాలు తెలిస్తే, ఆయనే వాడిని మార్చగలడు. అందుకే నేను ఇప్పుడే వెళ్ళి ఆ ఆత్మానంద స్వామిని కలుసుకోవాలనుకుంటున్నాను," అన్నాడు.

ఇక భర్తకు అడ్డు పలికి ప్రయోజనం లేదనుకుని గోపాలుడి భార్య, వాడితోపాటు శృంగవరానికి బయలుదేరింది.





# చందమామ కబుర్లు

## మేళాలో 'మహల్'

ఇటీవల కొత్త ఢిల్లీలో 'బెలూన్‌మేళా' జరిగింది. ఈ సందర్భంగా జరిగిన పోటీలలో మనదేశం నుంచే కాకుండా, జర్మనీ, ఇంగ్లాండు దేశాలకు చెందిన దాదాపు పది బృందాలు పాల్గొన్నాయి. ఆరోజు పొద్దున దట్టంగా పట్టిన పొగమంచు కారణంగా అనుకున్న సమయానికి పోటీలు ప్రారంభంకాలేదు. అయితే, హఠాత్తుగా ఆకాశంలో ప్రత్యక్షమైన 'బెలూన్ తాజ్ మహల్' అక్కడి వారందరినీ అలరించింది. ఒక బెలూన్‌పోటీ ఔత్సాహికుడు, బెలూన్‌లతో తాజమహల్ చేసి ఎగరవేశాడు. ఆ సమయంలో అక్కడే ఉన్న మన ఉపరాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్ దానిని చూసి, "మన తాజమహల్ అందాన్ని చూసిన ఒక వైస్రాయ్‌కి దానిని అలాగే ఇంగ్లాండుకు తరలించాలనే కోరిక వుండేది. ఆ మహానుభావుడు ఇప్పుడే గనక వుంటే ఈ 'మహల్'ను కూడా ఒక్కొక్క బెలూన్‌గా తన దేశానికి ఎగరవేసుకుపోవాలనుకునేవాడు!", అనేసరికి అందరూ నవ్వేశారు!

## బాణాసంచా కాల్చే 'యంత్రం'

దీపావళికి బాచాసంచా కాల్చడానికి ఉత్సాహపడని పిల్లలంటూ ఉండరు. అయితే, కొందరికి దగ్గరికి వెళ్ళి టపాకాయలు కాల్చాలంటే భయం. మరి కొందరిని పెద్దలు బెదిరిస్తూ ఉంటారు. అయితే, అటువంటి భయం ఏదీ లేకుండా టపాకాయలు కాల్చే రోజులు అట్టేదూరంలోలేవు. ఎందుకంటే తమిళ నాడు, ఈరోడులోని ఒక పాఠశాలలో పనిచేసే కె. ఆనందన్ అనే డ్రాయింగు మేష్టారు – బాణాసంచాను చేతిలో పట్టుకుని కాల్చేలా ఒక యంత్రాన్ని రూపొందించాడు. ఈయంత్రంగుండా విద్యుత్తు ప్రసరించినట్టయితే అందులో వుంచిన టపాకాయకు నిప్పంటుకుని 20 అడుగుల అవతల ఎగిరిపడి పేలుతుంది!





# భరతమ్మ కథ

ఒకానొక అడవిలో ఒక భరతపక్షి వుండేది. చిన్నప్పటినుంచి అది ఉపకారబుద్ధి కలది. భూలోకంలో దానికి అయువు నిండిన తరవాత, దాని పుణ్యంకొద్దీ విమానంమీద దేవదూతలు దిగివచ్చి దానిని స్వర్గానికి తీసుకువెళ్ళారు.

అక్కడ దేవతలందరూ భరతపక్షినిచాలా గౌరవించి, "నీకు ఏం కావాలో కోరుకో," అన్నారు. ఏమి చెబుదామన్నా భరతపక్షికి అప్పటికి తోచింది కాదు.

కొన్నాళ్ళు స్వర్గంలో సుఖంగా గడిపిన తరవాత, ఆ భరతపక్షి దేవతలపెద్ద వద్దకు వెళ్ళి, "నాకిక్కడేమీ తోచటంలేదు. మళ్ళీ నేను భూలోకానికి వెళ్లి వుండేటట్లు అనుగ్రహించండి,"అన్నది.

దేవతలు భరతపక్షికి ఏ రూపం కావాలన్నా పొందవచ్చుననీ, ఏ లోకంలో కావలసినా విహరించ వచ్చుననీ వరమిచ్చారు. అప్పుడు భరతపక్షి చిన్నచిన్న రెక్కలతో, అందమైన మానవ రూపంలో భూలోకానికి దిగివచ్చి తన అడవిలో, మామూలు స్థలంలో ఇల్లు కట్టుకొని కాలక్షేపం చేయసాగింది.

ఇలా వుండగా ఒకరోజున— భరతమ్మకు చిన్నప్పటి సంగతి ఒకటి జ్ఞాపకానికి వచ్చింది: చిన్నప్పుడు భరతమ్మ, బస్తీలో వుండే తాతగారింటికి వెళ్ళిందట. ఆ బస్తీలో ఎన్నో సౌకర్యాలున్నాయి. ఎన్నో వినోదాలున్నాయి. అందుచేత అక్కడ తోచకపోవటమనేది ఉండదు. ఎప్పుడూ ఆనందంగా కాలం గడపవచ్చు.

ఇప్పుడు భరతమ్మకు ఆ చిన్ననాటి ముచ్చటజ్ఞాపకంరావడంతోబుద్ధి మళ్లింది. "ఈ అడవిలో ఒక్కర్తెనూ ఏమీ తోచకుండా ఎలా కాలక్షేపం చేసేది? బస్తీలో మా తాత గారింటికి వెళతాను. అన్ని సౌఖ్యాలూ అను




భవిస్తూ అక్కడే ఉండి పోతాను. ఇక ఈ అడవికి తిరిగి రానేరాను. 'బస్తీ భరతమ్మ' అని అనిపించుకుంటే నాకు ఎంతో గౌరవం కూడాను," అనుకుంది.

ఈ నిశ్చయంతో భరతమ్మ ఉదయానే భోజనంచేసుకుని, మంచి మంచి దుస్తులతో ముస్తాబు చేసుకుంది. ప్రయాణానికి కావలసిన డబ్బు జాగర్త పరచుకుంది. ఇంటి తలుపులు తాళం వేసింది. తాళం చెవి కిటికీ ఊచలలో దాచింది. కాలినడకని బస్తీకి వెళదామని బయలుదేరింది.

తీరా బయలుదేరి రెండడుగులు వేసే సరికల్లా, "భరతమ్మా! భరతమ్మా!" అంటూ ఒక లేడిపిల్ల పరుగెత్తుకు వచ్చింది. అది భయంతో వణికిపోతున్నది. వెనక్కు వెనక్కు తిరిగి చూస్తున్నది.

"ఏఁవమ్మా, లేడెమ్మా! ఇలావచ్చావు?" అని లేడిపిల్లను అడిగింది భరతమ్మ.

"ఏమిటేమిటి? మన అరణ్యంలో వేటకాండ్రు ప్రవేశించారు. విల్లంబులుచేత పట్టుకొని కనబడ్డ జంతువునల్లా తరుముకు వస్తున్నారు. నన్ను కాస్త నీ ఇంట్లో తల దాచుకోనిస్తావా, భరతమ్మా!" అని బతిమాలుకుంది లేడిపిల్ల.

జాలిగుండె గల భరతమ్మ, దాచుకొన్న తాళంచెవి బయటకు తీసి, తలుపు తాళం తెరిచి, లేడిపిల్లను లోపల ప్రవేశపెట్టి, "అమ్మడూ! పెరట్లో సమస్తమైన కూరలూ వున్నాయి, ఫలజాతులున్నాయి. నీ ఇష్టం వచ్చినట్టు స్వేచ్ఛగా వుండు," అని చెప్పి, మళ్లీ తలుపు తాళం వేసుకొని, తాళంచెవి కిటికీ ఊచలలో దాచుకుని, తాతగారింటికి బయల్దేరింది.

తీరా బయల్దేరి రెండడుగులు వేసేసరికల్లా, "భరతమ్మా! భరతమ్మా!" అంటూ ఒక దీనాలాపం వినిపించింది.

మళ్ళీ ఎవరో ఆపదలో చిక్కుకొని వుంటారని అనుకుంది భరతమ్మ. అనుకొన్నట్టుగానే, చూడగా, ఒక బాతు ఉరకలు వేసుకొంటూ రావటం కనిపించింది.

"ఏఁవమ్మా బాతమ్మా! ఇలావచ్చావు?" అని అడిగింది భరతమ్మ.

"మావాళ్లంతా కొలనుకు స్నానానికి వచ్చారు. నేను జలకాలాడే సరదాలో వాళ్ళు రమ్మనగానే తిరిగి పోలేదు. వాళ్లు ఇళ్ళకు వెళ్ళిపోయారు. నేను తప్పిపోయాను," అని చెప్పింది బాతు దీనంగా.

అందుకు భరతమ్మ బాతును బుజ్జగించి, "బాతమ్మా, బాతమ్మా! నీకు వచ్చిన భయమేం లేదు. మా పెరట్లో పెద్దకొలను ఉన్నది. ఆ కొలనులో నీ ఇష్టంవచ్చినట్టుగా జలకాలాడుకోవచ్చు. నీకు లేడెమ్మ సాయం వుంటుందిలే. నేను మా తాతగారింటికి పోయి తిరిగివచ్చాక నిన్ను మీ ఇంటికి దిగబెట్టిస్తాను," అంటూ కిటికీ ఊచలలోని తాళంచెవి తీసి, తలుపుతెరిచి, బాతమ్మను పెరట్లోవుండే కొలనులో ప్రవేశపెట్టింది. తరువాత మళ్ళీ భరతమ్మ తలుపు తాళం వేసుకుని, తాళంచెవి కిటికీ ఊచలలో దాచుకుని, బస్తీలో తాతగారింటికని బయలుదేరింది.

ఇప్పటికే చాలా ఆలస్యమై పోయింది. అందుచేత భరతమ్మ ఈసారి గబగబ అడుగులు వేయసాగింది. తీరా నాలు గడుగులు వేసేసరికల్లా "భరతమ్మా! భరతమ్మా!" అంటూ మళ్ళీ ఒక ఆర్తనాదం చెవినిపడింది. అక్కడే ఆగి వెనక్కు తిరిగి చూసింది భరతమ్మ.

ఒక చిన్నారి ఉడుత. అది మొహం చిన్న బుచ్చుకొని వున్నది. దానిని చూసి, "ఉడుతమ్మా, ఉడుతమ్మా! ఏం ఇలా వచ్చావు?" అని అడిగింది భరతమ్మ.



"వర్షాకాలానికి సరిపడేటట్టుగా గ్రాసం తెచ్చి చెట్టుతొర్రలో పెట్టుకున్నాను. గింజలు పోగుచేసుకువద్దామని, నేను పోయి వచ్చే లోపల ఎవళ్ళో దొంగలు ఒక్క గింజయినా లేకుండా ఇల్లు దోచుకు పోయారు. ఇన్నాళ్ల రెక్కల కష్టమూ వృధా అయిపోయింది. పైగా, ఈపూట వంటకు కూడా ఇంట్లో గింజలు లేకపోయె!" అని తన గోడు వెళ్లపోసుకుంది ఉడుత.

ఇందుకు భరతమ్మ, "ఓసి, ఈపాటి దానికే విచారమెందుకు ఉడుతమ్మా! మా ఇంట్లోఎంతతిన్నాతరగని ధాన్యపుగింజలూ, పప్పుదినుసులూ నిలవ వున్నాయి. నీ ఇష్ట మొచ్చినంతకాలం నాతోపాటు ఉండవచ్చు. నేను మళ్ళీ వచ్చేదాకా నీకు లేడెమ్మా, బాతమ్మా సాయంకూడా వుంటారు," అని చెబుతూ, కిటికీ ఊచలలోనించి తాళం చెవితీసి, తలుపులు తెరిచి, ఉడుతమ్మను గదిలో గాదెల దగ్గర ప్రవేశపెట్టింది.

భరతమ్మ మళ్ళీ తలుపు తాళంవేసి, తాళంచెవి కిటికీ ఊచలలో దాచింది. తాతగారింటికని మళ్ళీ బయల్దేరింది. తీరా ఇంకిప్పుడు సాయంకాలమైపోయింది.

బయల్దేరి ఒక్కడుగువేసిందో లేదో భరతమ్మ మనస్సు మారిపోయి, ఇంటికి మరలివచ్చింది. కిటికీ ఊచలలో దాచిన తాళంచెవి తీసింది. తలుపులు తెరిచింది. దుస్తులు విప్పి, ముస్తాబు తీసివేసింది. హాయిగా పడకకుర్చీలో కూర్చుంది.

"నా ప్రదేశమైన ఈ అడవిలో తోడి జీవులన్నీ కష్టాలు పడుతున్నవే! వాటి బాధలు చూస్తూ నేనెలా ఇల్లు వదిలి వెళ్ళేది? నా స్నేహితులు కష్టాలుపడుతూ వుండగా నేను మాత్రం బస్తీ వెళితే అక్కడ మటుకు నాకు సుఖముంటుందా? ఇదే నా బస్తీ. ఇదే నా స్వర్గం. నేనింక తాతగారింటికీ పోను, మరి స్వర్గానికీ పోను. నా నేస్తాలకు తోడుపడుతూ, వారితోపాటు ఈ అడవిలోనే వుండిపోతాను," అనుకొన్నది భరతమ్మ.

చిన్నప్పుడు ఎప్పుడో వెళ్ళివచ్చిన భరతమ్మ మరెన్నడూ బస్తీలో తాతగారింటికి వెళ్లనే లేకపోయింది!



# ప్రకృతి వింతలు:



## మొదట తల!

పాములు ప్రాణాలతోవున్న జంతువులను పట్టి తిన డానికే ఇష్టపడతాయి. అవి జంతువులనుపట్టి గట్టిగా బిగించికానీ, కాటువేసి విషం ఎక్కించికానీ చంపు తాయి. ప్రాణాలు పోయాయని తెలిశాక, మొదట వాటి తలతో ఆరంభించి, నెమ్మదిగా పూర్తిగా మింగేస్తాయి. వీటిలో కొండచిలువ జాతి పాములు అలా మింగిన జంతువుకు ఎముకలు ఎక్కువగా ఉన్నట్టయితే, చెట్టు కొమ్మకు చుట్టుకుని కడుపులోని జంతువు ఎముకలు నుగ్గయేలాగా చేస్తాయి!

## ఒకేరూపంగల ఆకులు!

సీతాకోకచిలుక కుడి ఎడమ భాగాలు ఒకే విధంగా ఉన్నట్టే సాధారణంగా ఆకుల రెండు భాగాలూ ఒకే విధమైనరూపంతో సమానంగా ఉంటాయి. ఒక ఆకును నడిఈనె గుండా రెండుగా చీల్చినట్టయితే, రెండు భాగాలూ ఒకే అచ్చులో పోసినట్టు ఉంటాయి. అయితే, అన్ని ఆకులూ ఇలా ఉండవు. ఉత్తర అమెరికాలోని 'సస్సాఫ్రాస్' వంటి చెట్లలో ఒకే రెమ్మకు మూడురకాల ఆకులుకూడా ఉంటాయి.






## జలాంతర్గాములకన్నా వేగం!

అంటార్కిటికా ప్రాంతంలో నివసించే పెంగ్విన్ పక్షులు ఎగరలేవు. అయితే, అవి నీళ్ళలో జలాంతర్గాములకన్నా వేగంగా పయనించగలవు. 'ఎంపరర్ పెంగ్విన్' పక్షులు 870 అడుగుల లోతు వరకు వెళతాయి. 20 నిమిషాల వరకు నీళ్ళలోపల మునిగి ఉండగలవు.

ప్రపంచంలోని మహత్తరమైన
గన్ యొక్క సజీవ ప్రతిరూపాన్ని
ఇప్పుడు మీ అబ్బాయికి యివ్వండి!



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1993 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * జనవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 26.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎదురు చూసేది నీళ్ళకోసం!  రెండవ ఫోటో : ఎవరు రావాలి వీళ్ళకోసం?

పంపినవారు : కళ్యాణం రమణారావు, 4/9, బ్రాడీపేట, గుంటూరు - 500 002 (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

# Crrrunch!

## And you'll love the fruit in it!

**nutrine**

# Soft Hearts

*Juicy, Crunchy, Fruity treats*

FREE!

Send 20 Nutrine Soft Hearts wrappers for a **FREE** Bunny mask to Nutrine Confectionery Co. Ltd., 232, Kilpauk Garden Road, Kilpauk, Madras 10.

* Stocks also available without this offer.






THE FINEST, WIDEST RANGE
nutrine
India's largest selling sweets

Visesh/NC/8938